# సృజన

అధునిక సాహిత్య వేదిక

ప్రథమ సంచిక



పరాభవ ఆశ్వయుజం
నవంబర్ 1966



ఒక రూపాయి



నిర్వహణ
సాహితీ మిత్రులు
హనుమకొండ
వరంగల్.

ప్రతులు— వెయి
పరాభవ ఆశ్వయుజం
నవంబర్ 1966

వివరాలకు, ప్రత్యుత్తరాల
వరవరరా
జడ్చర్ల (Rly. Stn.
మహబూబ్ నగర్
లే
వే. నరసింహారె
2/62
నక్కలగుట్ట, హనుమకొండ
వరంగల్

ముఖచిత్రం :
బాపు

ప్రతులకు
దీప్తికన్సరన్స్
జయప్రకాశనారాయణరోడ్,
వరంరల్.
లేదా
చింతల నరసింహాలు & కో
బుక్ సెల్లర్స్
హనుమకొండ, వరంగల్.

ముద
వేంకటరమణ ముద్రణాలయ
వరం

# ప్రయోగం

ఆధునిక సాహిత్యానికి ఒక పత్రిక లేదనే ఆరాటం. చాలా రోజులుగా చాల మందిని బాధిస్తూనే ఉన్నది.

ఆధునిక సాహిత్యమంటే- శాస్త్రీయ దృక్పథం, హేతువాదం, సమకాలీన సమాజం- వీని ప్రభావం వ్యక్తి జీవితంలోని అన్ని అంశాలమీద కొద్దో గొప్పో ఉన్నదని గుర్తించడం. ఈ గుర్తింపు ఉన్న రచనని ఆధునిక సాహిత్యంగా నిర్వచించవచ్చు: ఇతర మైన విలువల్నికూడా విస్మరించకుండా.

ఇది ఒక సాహస ప్రయోగం. ఇది పత్రికా? కాదు; 'మారుతున్నకాలాన్ని విస్తృతమౌతున్న జాగృతినీ, ప్రతిబింబించే అనువదించే ఒక Forum.' దీనికి సంపాద కుడు లేడు, సాధకులే తప్ప. ప్రయోగశీలత్వం, సృజనాత్మక శక్తి, ఆధునిక దృక్పథం, ఈ Forum పునాదులు.

'సృజన,' తొలి సంచికను కవి తిలక్‌కి అంకితం చేస్తున్నాము. ఏడాది క్రితం ఇట్లా ఆధునిక సాహిత్యంకొరకు ఒక పత్రిక స్థాపించాలనుకొంటున్నాము అని రాసి నపుడు తిలక్ ఇట్లారాసారు. "ఒక Broad Based Standard of literature కు మనం ఒక Incentive నీ ఒక Forum నీ కల్పించాలి," అని ఆ ప్రయత్నంలో మేముండగానే ఆయన కన్ను మూయడం మాకొక సవాల్‌గా మిగిలిపోయింది. మా ప్రయ త్నానికి కాలం గీటురాయి.

ఈ Forum ని సాహిత్య మిత్రుల సంఘం ఆరంభిస్తున్నది. నెల నెలా పది రూపాయల చొప్పున జూన్ 1966 నుండి చెల్లించేవారూ ఇక ముందు చెల్లించబోయే వారు మాత్రమేకాదు, ఏ రూపాన ఏ సాయం చేసేవారైనా ఈ సంఘ సభ్యులే. దీనికి సీమలులేవు నియమాలులేవు. ఒకటే షరతు- సహకార భావం ఉండాలి.

'సృజన' మలి సంచిక వస్తుందా అన్నది తెలుగువాళ్ళ సాహిత్యాభిరుచి మా కృషిని ఆదరించి ప్రోత్సహించడంమీద ఆధారపడి ఉంటుంది.

మాకేమి గొప్ప కలలులేవు. కాని మూడు నెలలకొక సంచిక తేవాలన్న సంకల్పం మాత్రం ఉన్నది. ఆ సంకల్పం నెరవేర్చే బాధ్యతను, మాతోపాటు పాఠకులూ పంచుకొంటారని ఆశిస్తున్నాం.

ముఖపత్ర చిత్రం వ్రాసి యిచ్చిన శ్రీ 'బాపు' గారికీ, రచయితలందరికీ మా హార్దిక కృతజ్ఞతలు.

# సూచి

# కవి తిలకుడు లేడు | కాళోజి

కవి తిలకుడు లేడు.
కవితాక్షేత్రం పడ్డది బీడు.
ముద్దులొలికే మోము
మోముకు ముద్దొచ్చే పలుకు
పలుకుకు అందాలు గూర్చే నాజూకు
నాజూకు తనానికి తాళింపువంటి నఖరా
మల్లెపువ్వు వంటి శరీరం
అంతకన్నా తెల్లని ముస్తాబు
నలుబది దాటినా దేవతలప్రాయం నిగ నిగ
దబ్బపండు కాంతి తళ తళ
మనిషి పూలరంగడు
మనసు 'సదా బహార్'
నడక 'మస్తానా'
నడవడి 'వస్తాదానా'
రచన కవిత పాదాల పారాణి, పాపట బొట్టు
శారద నుదుటి తిలకం
రసికతకు రాణింపు, ధ్వనికి గుబాళింపు
"ట్రాన్స్పరెంట్ చీకటి"
వానికి వాడే సాటి

సోమసుందర్

# ఆతని జ్ఞాపకాలు: వాడని జాజిపూలు

మనిషి జీవితంలో యౌవనావిర్భావం అసదృశమైన అనుభవం. వరద గోదావరి ఉరక. ఊపే పెనుకరువలి. ఎవ్వడూ దానిపట్టు తప్పించుకోలేడు. అడ్డుకోలేడు. ఆగికోలేడు. మహౌన్నత్యశిఖరాల కెగిరిస్తుంది. పాతాళపు టిరుకు సందులకి దిగద్రోస్తుంది. అది ఒక మహాచైతన్యస్రవంతి. ఒక మోహనశాపం.

అంతకన్న మించినది— వ్యక్తి హృదయంలో కవితావిర్భావం. ఎందుకో తోచదు, ఊపిరి సలపదు. ఏమీ చెయ్య బుద్ధిపుట్టదు. అలా అని ఖాళీగా నిర్వ్యాపారంగా కూచోనియ్యదు. లోచెవిలో ఎప్పుడూ ఏదో మ్రోత. లోగొంతులో ఏదో పాట. మనసు లోపలి మనసులో ఎందుకో ఆరాటం. అశాంతి. దిగులు. బెంగ! తీరని తీయని వ్యధ........వేదన!

సూర్యోదయకాంతి చాలదు. వెన్నెల జిలుగుల చలువ సరిపడదు. అను-భూతినుండి అనుభూతికి అనవరతం అర్రులుచాచే ఎద. గుండె గూడులో ఎడతెరపి లేని తేటుల రొద. పాటల వెత. ప్రతికవితా అసంపూర్తి. ప్రతి అనుభూతీ అసంతృప్తి.

ఒక్కసారిగా పర్వత శిఖరాన్నధిరోహించి హరిత శాద్వల సానువులలో ఉదయతుహిన కిరణాలలో ఒక్కసారిగా పరుగులు పెడుతూ పుడమిని చేరుకోవాలన్న కోరిక. ఏరహస్తీరాలకో ఎగిరిపోవాలన్న కాంక్ష. గుండెనిండా కోరికల పెనుమ్రోత. చూసినది చాలదు. చేసినది సరిపోదు. అనుభూతిపిపాస చల్లారదు. అన్నమయకోశం చేస్తున్న ఆర్భాటాలకి ఆనందమయకోశం పీగిపోదు. ఎప్పటికప్పుడు లోకం క్రొత్తగా అనుభూతి వింతగా, పరిసరం సమీర స్వచ్ఛంగా, తారసిల్లుతూనే ఉంటుంది. ఆలోచనలు అమృతసలిలంగా పారుతూనే ఉంటాయి. లోఎదలో గులకరాళ్ళ గుసగుసలు వినిపిస్తూనే ఉంటవి. తనతో ఎవరో తనలోని మరొకరు చెబుతున్న మాటలు వినిపిస్తూనే ఉంటవి. రహస్యగీతాలు పాడుతూనేఉంటవి.

యౌవనదశామాహాత్మ్యము గుర్తించినా లేకున్నా ప్రతి మనిషి జీవితంలోను తప్పనిసరిగా ఎదురై తీరుతుంది,

అలాగే ప్రతి కవిజీవితంలోను ప్రారంభంలో ఈ వ్యథ తప్పనిసరిగా ఆసన్నమవుతుంది.

అప్పుడలాంటి స్థితిలో నేనున్నాను. కావాలని పల్లేరు కాయలమీద నడుస్తున్నాను. ఉమ్మెత్త కాయలు పైకి విసరి చేతిమండ ఒగ్గుతున్నాను. ముళ్ళ మండకి గుచ్చుకోగానే చేయి విసురుగా గిరగిరా తిప్పి రక్తం తెప్పించుకోవడం ఒక సరదాగా మసులుతున్నాను.

ఒక ఖండకావ్యం పూర్తి చేయడానికి రాత్రి తెల్లవార్లూ మెలకువగా ఉన్నా అలసట లేదు. ఒక సౌందర్య దృశ్యాన్ని వీక్షించడం కోసం, ఒక అనుభూతి కోసం ఎన్నిమైళ్ళు నడిచి వెళ్ళినా ఫరవాలేదు. ప్రాచీనమైన కొండలనుంచి నవ నవోన్మేష కావ్యంవలె క్రొళ్ళురుకుతూ దుముకుతూన్న గంగధారలలో తలమునకగా స్నానంచేదామన్న ఉబలాటమే కాని క్రింది పాకుడు రాళ్ళపై అడుగులు జారి, ఎముకలు విరుగుతాయన్న భయమే లేదు. స్పృహ లేదు. నిజమే– అదొక అపస్మారక స్థితి.

అప్పుడు, సరిగ్గా ఆస్థితిలో ఉన్నాను నేను. కవితా నవమన్మథుడనని ఊగిపోతున్నాను. నిజమేమరి, పదునాలుగేళ్ళ ప్రాయంనుంచీ కూడా ఉన్న స్నేహితులు, బంధువులు, ప్రియబాంధవులు నేనందగాడినని ప్రస్తుతిస్తూనే ఉన్నారు. ఈ స్తుతిలో మోసులెత్తిన గర్వరేఖలు నా శిరోజాలపై తురాయిలు తొడిగాయి. పింఛాలలంకరించాయి. పుట్టినదాదిగా బాదరబందీలెరుగని బ్రతుకాయె. ఫాయీ, ఫామేదా, దర్జా, దర్పమూ, అంతా జమీందారీవతు. దానికి తోడు సౌందర్య గర్వం, ఇది చాలక కవితా శోభాదర్పం.

అందుకనే ఆరోజుల్లో నేను ఠీవిగ నడుస్తున్నాను. ఏమన్నా లెక్కలేదు. ఎవరన్నా లెక్కలేదు. కేవల మూర్తీభవత్ గర్వరేఖగా నడుస్తున్నాను. అంతర్జీవుని విరహ వేదనలతో ఏడుస్తున్నాను. వర్తమానకాలపు మృచ్ఛకటికలో సమాజ వసంతసేనను ఆసీనచేసి ఈడుస్తున్నాను. నాబలాన్ని చూసి నేనే మురిసిపోతున్నాను.

అట్టిసమయంలో అతడు కనిపించాడు నాకు. ఆనాటివరకూ నేను పొందుతున్నది అజ్ఞానగర్వంమాత్రమేనని తెల్పడానికా అన్నట్లు అతడు సాక్షాత్కరించాడు.

నిజమేమరి: నాలోనేను చూసి గర్వపడే గుణాలన్నీ అతనిలో అతిశయించి ఉన్నాయి. పైగా కవితావాల్లభ్యంతో లబ్ధప్రతిష్ఠుడై మెరుస్తున్నాడు.

నేనపుడు కాకినాడలో పిఠాపురం రాజావారి కళాశాలలో ఇంటర్మీడియట్ చదువుతున్నాను. కావలసినవీ, అక్కరలేనివీ తలకెత్తుతున్న చదువులపై కోపిస్తున్నాను. కావలసినవాటిని గ్రంథాలయాలలో వెదుక్కుంటున్నాను. క్లాసులు ముగిసిన తర్వాత అమ్మాయిలతో కలిసి కబుర్లు చెప్పుకుంటూ యింటికి వస్తున్నాను. అట్టి సమయంలో నాకతడు కనిపించాడు. ఉదయ సూర్యుడు పొడుపు కొండదిగి నేరుగా నడచివచ్చి, నా ఎట్టఎదుట నిలచి నన్ను పలుకరించాడు. కాదేమో— రజితాద్రి దిగి కదలివచ్చిన హిమాంశుదేమో! ఏమోమరి— అతడుమాత్రం బాలగంగాధర తిలక్.

సూర్య చంద్రుల సమ్యక్స్వరూప మతడు. వాస్తవ భావకవిత్వాల సమ్మేళన మతడు. తాత్త్విక మూల్యాల ఉష్ణమూ, ప్రసన్న కవితా తుహినాంశువుల రశ్మీ ఒకే హృదయంలో రంగరించుకొన్న వాడు. అతడు మన్మథ మాన్మథుడు. కవితా వసంతుడు! కళ్యాణ దీధితుడు!

మా కళాశాల ఆంధ్రాభ్యుదయోత్సవాలు జరుగుతున్నాయి. తొలినాటి సాయంత్రమే సభలు ప్రారంభమయ్యాయి. అది మరునాటి ఉదయం సభ. "సహనావవతు— సహనౌ భునక్తు— సహవీర్యం కరవావహై" అను ఋక్కు ప్రార్థనగా పఠించబడింది. వేదికపై శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి ఆసీనులయ్యారు. వారాసభకధ్యక్షులు. వేదికమీదికి మరొకిద్దరు యువకులు కూడ ఆహ్వానింపబడ్డారు. వారు శ్రీ సంపత్; శ్రీ బాలగంగాధరతిలక్. వారిరువురూ అధ్యక్షులకిరువైపులా కూర్చున్నారు. శ్రీ తిలక్ నేను కూర్చున్న దిశగా కూర్చున్నాడు. అనగా అధ్యక్షుల కెడమచేతిప్రక్క.

శ్రీ కృష్ణశాస్త్రి మేఘ గంభీర స్వరంతో ఆధునికసాహిత్యం గురించి అనర్గళంగా మహోపన్యాసం చేశారు. వెనుకచూపు, వెనుకనడకల పీతల గురించి అధిక్షేపించారు. "మనది కృతమహాయుగం— ముందున్నది ముందున్నది మనదే మరి మనదే!" అన్న స్వీయరచన గానం చేశారు. యువ కవులిద్దరినీ పరిచయం చేశారు.

శ్రీ సంపత్ లేచాడు. ఆధునిక సాహిత్యంలో శ్రీశ్రీ తో ప్రారంభమైన కొత్తయుగాన్ని స్పర్శించాడు. సోదాహరణంగా వివరించాడు. శ్రీ శ్రీ కవితకు, దాని చారిత్రిక ప్రాధాన్యతకు— సాహితీ విప్లవశక్తికి భాష్యకారుడై నివాళులర్పించాడు.

స్వీయ రచనలు— "నాగి, మౌనఘోష, సందె కబళం" అను గీతాలు మనోహరంగా గానం చేశాడు.

ఇంత సేపటినుంచీ— నేను ఏమి వింటున్నా— నా చూపులు ఏ మనోహరా కృతిని పరిభ్రమిస్తున్నవో ఆ వ్యక్తి లేచాడు. అతడు రూపు దిద్దుకొన్న వసంతునివలె నున్నాడు. సన్న పోగారుతో మలచిన రజిత విగ్రహానికి పసిడి నీరూదినట్లున్నాడు. కళ్ళచివర కాంతి సంగీతాన్ని మెరిపిస్తున్నాడు. అసిత కైసికీ బంభర శ్రేణిగా అతని శిరోజకిరీటాన్ని కదుపుతున్నాడు. గొంతెత్తి ఉపన్యసిస్తున్నాడు. నెమ్మదిగా మంద్రంగా మితంగా తన కవితోపాసన గురించి విశద పరుస్తున్నాడు. కవితాగానం ప్రారంభించాడు. 'మాగ్నాకార్టా......... గుండెకింద నవ్వు......... సంధ్య.........' మనోజ్ఞంగా గానం చేశాడు.

అతడు బాలగంగాధర తిలక్. అది 1944 లో జనవరి నెల. నిజమే— "గగనమొక రేకు, కన్నుగవ సోకు, ఎరుపెరుపు చెక్కుళ్ళ విరిసినది చెంగల్వ...." అదీ అతని మూర్తి. అదే అతని కవితామూర్తి: ఒక ఉదయసంధ్యాకవిత చైతన్యరేఖ.

సభ ముగిసింది. సభాసదులు లేస్తున్నారు. సదస్యులూ లేచారు. నేను మిగిలిన సాహితీ మిత్రులతో వేదికకడకు వెళ్ళాను. కవులకు నమస్కరించాను. కృష్ణశాస్త్రి మమ్మల్ని శ్రీ సంపత్, తిలక్‌లకు ఎరుకపరిచారు. కొంచెం ఇష్టాగోష్ఠి సాగింది. కాఫీలు సేవించాము. కదిలాం. ఆనాటి సాయంత్రం మా పరిచయం మరింత గాఢమయింది. అది మా తొలి సమాగమం.

మరుసటి సంవత్సరం శ్రీ సంపత్ మా కాలేజీలో ఆంధ్రోపన్యాసకులుగా నియుక్తుడయ్యాడు. కృష్ణశాస్త్రిగారు కాకినాడలోనే ఉంటున్నారు. సంపత్‌కూ మాకూ గురు శిష్య సంబంధం లేదు. స్నేహసంబంధం. సాహితీ సోదర సంబంధం. అందరికీ కృష్ణశాస్త్రి గురుపాదులు. ప్రతిరోజూ సాయంత్రం— అటు స్టేషను సమీపంలోని కృష్ణశాస్త్రి గారింటనో, యిటు గాంధీనగర్ పార్కు సమీపాన సంపత్ యింటనో తప్పనిసరి సమావేశాలు. కృష్ణశాస్త్రి గారింట సమావేశాలలో సంపత్తు, పాలగుమ్మి పద్మరాజు, నేనూ, రాంషా, వెంకన్న పంతులు, ఇస్మాయిలూ ఉండేవాళ్ళం. ఇంచుమించు ప్రతిరోజూ సాగేవి. నన్నయ తిక్కనల భారత రచన, అల్లసాని పెద్దన మనుచరిత్ర; ఎన్నో విషయాలు. టాగోరు, షెల్లీ, కీట్సు మున్నగు లిరిక్ కవులంతా సాగిపోయేవారు. సంపత్ ఇంట సమావేశాల్లో, ఇలియట్, ఆడెన్ స్పెండర్, గేస్కోయిన్, జోయిస్, మున్నగువారు, ఫ్రెంచిసర్రియలిస్టులు, డాడా

యిష్టులు,– అంతా ప్రత్యక్షమయ్యేవారు. కాలేజీ గ్రంథాలయంలోని ఆధునికాంగ్ల సాహిత్యం మా అధ్యయనానికి తెరువులేర్పరచేది. సంపత్ పథ నిర్దేశికుడు. కృష్ణ శాస్త్రి దేశికులు.

అట్టి సమయాలలో శ్రీ తిలక్ అత్తవారింటికి వచ్చినపుడల్లా సంపత్ ఇంటికి వచ్చేవాడు. అనేకసార్లు మేమక్కడ కలుసుకున్నాం. సంపత్ మాగురించి ఎన్నో మంచి మాటలు చెప్పేవాడు. ఈ మాటు మరింత సన్నిహితులమయ్యాం.

ఆంధ్రాభ్యుదయ రచయితల రెండవ మహాసభ రాజమండ్రిలో జరుగుతోంది. 45వ సంవత్సర ప్రారంభ దినాలవి. నిజానికంతకుపూర్వం ప్రథమ మహాసభ తెనాలిలో జరిగినా– అప్పటికీ ఉద్యమం ఇంత పరిణతినీ, పరిగణనా పొందలేదు. ఆధునికాంధ్ర సాహిత్యానికి రాజమండ్రి నిజానికి పెండ్లి పందిరే వేసింది, వీరేశలింగం హైస్కూలులో మూడు రోజుల సభలు. కృష్ణశాస్త్రిగారినీ, శ్రీశ్రీని మరికొంత మందిని రథారూఢుల చేసి ప్రజలంతా కలసి పురవీథులలో ఊరేగించారు. ఆ సభలలో ఆధునిక కవులందరూ పాల్గొన్నారు. జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి నిక్కరూ షర్టు ( యూనిఫాం ) వేసికొని వాలంటీరుగా పని చేశాడు. శ్రీ పిలకా గణపతి శాస్త్రి వీరేశలింగం హైస్కూలులో తెలుగు పండితుడు. ఆయనా ప్రముఖ పాత్ర వహించారు. ఆసభలో వేదికపై కృష్ణశాస్త్రి, వేరొకప్రక్క శ్రీశ్రీ– మధ్యలో యిరువురినీ కలిపే కాంతిరేఖలాగ తిలక్. సభలు మనోహరంగా జరిగాయి. సభానంతరం శ్రీ పిలకా వారింట శ్రీ తిలక్‌తోసహా మేమంతా సమావేశమయ్యాము. కొన్ని సమస్యలు చర్చించుకున్నాం. ఎన్నో కబుర్లు. అన్నిటికీ కవిత్వమే జీవగర్ర.

కాలవ్యాళం మ్రింగివేయకపోతే ఆ మధుర స్మృతులన్నీ యిక్కడ రాయగలిగితే– ఎంత బాగుండును! కాలం గాయాన్ని మాన్పుతుంది. ఘాతుకాలు చేస్తుంది కూడా కాబోలు!

తిలక్ జబ్బు పడ్డాడు. వారి తండ్రిగారి మరణం అతని హృదయం మీద పెద్ద దెబ్బ తీసింది. అతని నాడీమండలం కొంత దెబ్బతింది. డాక్టర్లే పోల్చుకోలేని వ్యాధికి గురి కాబడ్డాడు. "అకస్మాత్తుగా నరాలు బిగిసిపోయే టట్లయ్యేవి. హృదయం ఏదో భీతితో ఉండ చుట్టుకు పోయేది. ఇంచుమించు మధ్యాహ్న మీ స్థితి ప్రారంభమైతే– అర్ధరాత్రి ఎప్పుడో తగ్గేది. ఈ లోగా కడుపు పొంగరించేది. ఒక అపస్మారకస్థితి ప్రారంభమయ్యేది. తగ్గగానే విపరీతమైన ఆకలి; నీరసం. అప్పుడు తక్షణం

అన్నం తినేయాలి, యిలా తొమ్మిదేళ్ళు వ్యాధి పీడితుడ నయ్యాను" అన్నాడు తిలక్— పదేళ్ళ తర్వాత.

ఎంతో ధనం వెచ్చించబడింది, అతని కవితా జీవితంలోని ఎంతో అమూల్య కాలం నీరుకారిపోయింది.

ఇన్ని రోజులూ శ్రీ తిలక్ సతీమణి శ్రీమతి ఇందిరాదేవిగారు అతనిని కంటికి రెప్పలాగ కాపాడారు. తెరువు మరుపులుగా సాగిన అతనిని అత్యంత ప్రేమతో సాకేరు. మనసు కాస్త తెరిపిన పడినపుడు అతను కథలు చెప్పేవాడు. పద్యాలు చెప్పేవాడు. అవన్నిటినీ వ్రాసిందామె. తెలుగు జాతికొక అమూల్య సంపద అందించిందామె. కవితిలక్‌కు నిజమైన కళత్రి మనిపించుకొన్నదామె. చాలా మంది కవులకు భార్యలుంటారు. కొద్దిమందికి ప్రేయసులు కూడా వుంటారు. కాని మరీ కొద్దిమందికి మాత్రమే— 'కళత్రా'లుంటారు. అట్టి ధన్యులలో శ్రీ తిలక్ ప్రథమ గణ్యుడు.

శ్రీ తిలక్ ఏకపత్నీవ్రతుడు. శ్రీరాముడు ఏకపత్నీవ్రతుడు కావడానికి కారణం వైదేహి. ఆమె సకల సౌందర్య సౌభాగ్యాలకూ ప్రతీక. ఆమెవంటి కళత్రాన్ని పొందిన తిలక్ ఏకపత్నీవతుడు కాక మరేమవుతాడు? నిజమే అతని అనుజులు కూడ లక్ష్మణాదులే.

తిలక్‌నుచూసి చాలామంది కవులే ఈర్ష్యాళువులయ్యేవారు. అన్ని సంపదలూ అతనికేపట్టడమేమా అని వారి బాధ. తిలక్‌కు ఏమీ జబ్బులేదనీ, కేవలం జరుగుబాటు రోగమనీ అంటూండేవారు. అన్యాయంగా శ్రీశ్రీ ఇచ్చిన (అ) యోగ్యతాపత్రింవల్ల ఒక పెద్ద విమర్శకుడై దేశంలో పీఠంవేసిన రాముని భక్తుడొకడు నాతో అదే అన్నాడు. అలా అన్న పెద్దలు— అకస్మాత్తుగా తిలక్ చనిపోయాడన్న వార్త విని గుక్క తిప్పుకో లేకపోయివుంటారు!

నఖినేటిపల్లిలో ఉపన్యాసం ఇవ్వడానికి వెళ్ళాను. వస్తూ— వయోభారంతో అవసానదశలో ఉన్న శ్రీ చింతాదీక్షితులవారిని దర్శించుకొన్నాను. "గుత్తునా యని జాతి ముత్యాల్ గుచ్చినాడే" అన్న 'మహాకవి' శీర్షికతో గల ఖండిక కర్తృత్వ విషయంలో— శ్రీ జలసూత్రం నాలో కలిగించిన సమస్యలోని సత్యా సత్యాలను తేల్చు కుందుకు వారిని సందర్శించుకొన్నాను. నా కూడా మాశిష్యుడు మాధవ ఉన్నాడు. మరొక సాక్షిగా నర్సాపురంలో ప్రముఖ న్యాయవాది శ్రీపాద లక్ష్మీనరసింహం గారిని

కూడా తీసుకు వెళ్ళాను. శ్రీ చింతాదీక్షితులుగారు తెల్పిన హంశాలపై ఆంధ్రపత్రికలో వ్యాసం రాశాను. నర్సాపురం నుంచి తణుకు వెళ్ళాను. తిలక్‌ను కల్సుకోవడమే పని. శ్రీ తిలక్ కవితారశ్మివల్ల తణుకు తణుకుగా రూపొందింది మరి. తణుకు నన్నయగారి జన్మస్థలం అవునో కాదో కాని — తిలక్ వల్ల స్మరణీయ మైంది. దర్శనీయమైంది.

తిలక్ ఇంటికి వెళ్ళేసరికి రాత్రి బాగా పొద్దు పోయింది. గేటు తోసుకొని లోపలికి వెళ్ళాము. వీధి వాకిట్లో కుర్చీలు వేసుకొని సాహితీ మిత్రులతో ఇష్టా గోష్ఠి జరుపుతున్నాడు. చూడగానే నన్ను ఆనవాలు పట్టలేకపోయాడు. దానికి కారణం— ఇన్నేళ్ళుగా సాగిన అస్వస్థతలో అన్నిటినీ అందరినీ మరచిపోవడం ఒకటి. నన్ను మొదటిసారి చూచినపడు నేనతిసన్నంగా ఉండేవాడిని. ఈ పన్నెండేళ్ళలోనూ శరీరం బాగా పెరిగింది నాకు. అతని ఆకృతీ కొంచెం స్థౌల్యమైంది. సంగతులన్నీ జ్ఞాపకం చేశాను. అతని మనసులో లీలగా మెరిసింది. కొన్ని విషయాలు జ్ఞాపకం వచ్చాయి. మొహమాటానికతనెప్పుడూ దొంగనవ్వులు చిలికేవాడుకాదు. ఎదిరివాడెంత పెద్దవాడైనా తన అభిప్రాయాన్ని ఖచ్చితంగా కుండ బ్రద్దలుకొట్టినట్లుగా చెప్పడానికి జంకేవాడుకాదు.

నిజానికి— హృదయాలు విప్పుకొని మాట్లాడుకొన్న మా తొలి సమావేశం అదే! అనంతమైన మా స్నేహానికి ప్రాణ ప్రతిష్ఠ చేసిన సమావేశం. ఆ తరువాత అతనికి నాతో మాట్లాడాలనిపించినప్పుడల్లా ఉత్తరం రాసేవాడు. నేను తణుకు వెళ్ళే వాడిని. ఎప్పుడు వెళ్ళినా — ఎన్నిరోజులున్నా— ఒకే మధురక్షణంగా మాసమాగమం సాగేది. క్షణికమై శాశ్వతమయ్యేది. ఎప్పుడు నేను అతనిని విడిచి రావాలన్నా కన్నీళ్ళు తిరిగేవి.

1959 నుంచీ మా కలయికలు మరీ ఎక్కువయ్యాయి. మామధ్య ఎన్నో ఉత్తరాలు నడిచాయి. ఎన్నో నిట్టూర్పులు తడిశాయి. ఎన్నో కలలు మెరిశాయి.

కాని— అతను లేకుండా నేను తణుకు వెళ్ళి అతని కుటుంబాన్ని చూడాల్సి వస్తుందని ఎన్నడూ తలపోయలేదు. అదే— అనుభవం ఎదురయ్యేసరికి అనంత దుఃఖంతో అపస్మారకం కావలసివచ్చింది.

59 లో నాకొకసారి గుండెనొప్పి వచ్చింది. కొంతకాలం విశ్రాంతిగా ఉండి ఒక ప్రముఖ డాక్టర్‌చేత వైద్యం చేయించుకొన్నాను. ఆసందర్భంలో అతను వ్రాసిన ఉత్తరాలు నేనెప్పుడూ మరచిపోలేను. వైద్యంకంటె అతని ఉత్తరాలు నన్నెంతో

అనునయ పరిచాయి. కాని తీరా— విపత్తు హటాత్తుగా అతనిపై గుండెపోటుగా విరుచుకుపడే సరికి నేకొక్క ఓదార్పు మాటయినా చెప్పలేకపోయాను.

ఇంచు మించుగా ఏడాదికి రెండుసార్లయినా కల్సుకుంటూసాగిన మాచెలిమిలో ఎన్నెన్నో జ్ఞాపకాలున్నాయి. అన్నీ వాడని జాజి పూవుల్లా నా హృదయంలో గుబాళిస్తూనే ఉన్నాయి. కాలమూ, స్థలాభావమూ నా ఆవేశాన్ని అవరోధిస్తూనే ఉన్నాయి. ఏమైతేనేం— తిలక్ స్మృతి అనంతమైన ఒక అమృత స్రవంతి. ఎంత చెప్పుకున్నా ఈ వ్యథ తీరేది కాదు.

అన్నింటికీ ఒక అంతమన్నది తప్పదు కాబోలు!

'59 లో జూన్ 22 న తిలక్ తణుకునుంచి వ్రాసిన ఒక ఉత్తరంతో ఈ రచనకీ ఒక అంతాన్ని ఘటింప చేస్తాను.

"తమ్ముడూ, సోమసుందర్.

నీ కార్డు అందింది. నీ గుండెనొప్పి తగ్గిందని చదివి చాలా రిలీఫ్ పొందాను. కవి హృదయం— ఒక విషాదానుభూతి వల్ల బరువెక్కినా— బాధ పడినా ప్రమాదం ఏమీలేదు. పైగా లోకానికి ఒక పద్యమో గేయమో దొరకవచ్చు కూడ! కాని నిజంగా గుండెలో వ్యాధి ఉంటే— ఆఖరికి ఏReflex Painలాంటి దేదైనా— అశ్రద్ధచేయటానికి వీల్లేదు.

"ఆమధ్య ఒకానొక ఆందోళనవల్ల, మానసిక వ్యథవల్ల నాకూ కొంచం Heart trouble కలిగింది. డాక్టరు సంపూర్ణ విశ్రాంతి తీసుకోమన్నాడు. ఇంటికి వచ్చి Prescription కాగితం వెనకాలే యింగ్లీషు పద్యం ఒకటి వ్రాశాను.

> 'When my heart has stopped at some silent hour,
> I know that not one of you will shed a tear............'

అంతే జ్ఞాపకం. ఇంకా కాలం నీకోసం Mourning ధరిస్తుందనీ.... .... ఏదో ఏదో వ్రాసినట్లు జ్ఞాపకం. ఆ ప్రిస్క్రిప్షను కాగితాన్ని వెదికి పట్టుకోవాలి.

ఈమధ్య నాకూ ఆరోగ్యం అంతబాగుండడంలేదు. నడుముదగ్గర Stiffness, నొప్పి బయల్దేరాయి. Spinal X-ray తీయించుకోవాలి. నువ్వు సాహితీయాత్ర

అని వ్రాస్తే మనస్సు ఎంతో ఉవ్విళ్లూరింది. ఎన్నాళ్లకి ఒకసారి పాతమిత్రుల పున ర్దర్శనమూ, కొత్త స్నేహితుల్ని సంపాదించుకోవడమూ— కాని కొన్నాళ్లపాటు ఆరోగ్యంమీద శ్రద్ధను కేంద్రీకరించి, నీరసపడుతున్న నరాల్లో బలాన్నీ, ఉత్సాహాన్నీ నింపుకుంటేకాని క్రిమ క్రిమ విశీర్ణమైపోయి వృద్ధాప్యాన్ని చేతులారా ఆహ్వానించిన తర్వాత ఏం లాభం వుంది?

ఏమైనా త్వరలోనే మనమిద్దరం ఒకసారి సాహిత్యయాత్ర చేద్దాం. మిత్రుల నుంచి అభిమానులనుంచి రమ్మని ఉత్తరాలు వస్తూనే ఉంటాయి. ఏదోసాకు చెబుతూనే ఉన్నాను. కాని ఇంక మిషలూ, మృషలూ పని చెయ్యవు. నీతో కలసి సరదాగా తిరిగి రావడం నాకు మరీ ఉత్సాహాన్ని కలిగిస్తోంది.

నువ్వు బెజవాడ వెళ్ళే ముందుగానో, లేక తర్వాతనో తణుకులో దిగి తప్పక నాలుగు రోజులపాటు ఉండాలి సుమీ! నీ కథ శీర్షిక 'రేపటి పాటలకోసం' చాలా కుతూహలాన్ని రేపుతోంది. ఆనందవాణి భక్తి సంచికలో నీ కథ చదివాను. నీ కథల పుస్తకం— కళా కేళీ పరిచరణ— అదీ ఈమధ్య చూశాను. కథా కథనంలో గద్యశయ్యా విధానంలో నీకు చక్కని కౌశలమూ ప్రజ్ఞ, ఉంది. నేను కొంత ఆశ్చర్య పడ్డాను. ఇంత బాగా రాయగలడా కథలు కూడా అని. ఇదివరకు నీరచనలు (గద్య) ఏమీ చదువలేదుగా. కానీ నీ కథల పుస్తకంలో ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించ డానికి గాని, బలపరచడానికి గాని నీవు చేసిన ప్రయత్నం ఆ కథాశిల్పంలోని ముఖ్య దోషంగా కనపడింది. ఆ కథల రక్తిని అనుభవించకుండా చేసింది. Pal pable design వల్ల కళ ఎప్పుడూ పరిమితమూ సంకుచితమూ అయిపోతుంది. అయితే ఆ రోజుల్లో నువ్వు అభ్యుదయపు ఇనుపకౌగిలిలో ఉండే వాడివి. కాని 'కాలనేమి' లో ఆదోషం మచ్చుకైనా లేదు. ఉత్తమ కథకి కావలసిన అన్ని లక్షణాలూ ఉన్నాయి. గడచిన ఆ రోజుల్నీ ఆనాటి మనస్తత్వాల్నీ తలపుకు తెస్తూ 'తాతయ్య' సజీవంగా గంభీరంగా దయనీయమైన స్వభావంతో నా మనసులో నిలిచి పోయాడు.

'జయంతి పత్రిక నాకు పంపించారు. నేనింకా ఏమీ పంపించలేదు. పత్రిక మొత్తంమీద సనాతనపు వాసన కొంచం ఎక్కువగానే కొడుతోంది. కాని వారి ప్రయత్నమూ కృషీ అభినందనీయమైనవి. వాళ్లకి మనం కొన్ని నేర్పవలసినవీ, మనం వాళ్లదగ్గర్నుంచి నేర్చుకోవలసినవీ కూడా ఉన్నాయేమో అనిపించింది.

ఏలూరు సాహిత్యమండలివాళ్లు రమ్మని పిలిచారు. ఈనెలకి రాలేనని, ముందు నెలలో వస్తాననీ వ్రాశాను. నీకు ఉత్తరం వ్రాయాలని మొదలుపెడితే. ఇలా

ఏదో వ్రాస్తూ వుండాలనే అనిపిస్తుంది. ఇంత ఆత్మీయుడివిగా ఎలా అయినావా అని ఆశ్చర్య పడుతూ ఉంటాను. ఉంటానూ— భవదీయుడు— తిలక్"

మేమిద్దరం ఎంత ఆత్మీయులమైనా పరిస్పరం అంగీకారం పొందని హంశాలు చాలా ఉండేవి. ముఖ్యంగా కళాసమస్యల పట్ల ఎన్నో విభేదాలుండేవి. అన్నిటికన్నా ముఖ్యమైన విభేదాలు రెండు: అతను సత్యధ్వంసీ, ద్యూతప్రియుడూను! అలా కావడం— నాకు బాధే కలిగించేది! ఐనా ఏం చేయగలిగాను; అతన్ని హృదయ పూర్వకంగా ప్రేమించడం తప్ప? ! చెప్పకుండా వెళ్ళిపోతే దుఃఖించడం తప్ప? !

—o—

ఏమైనా జీవితాన్ని సమగ్రంగా దర్శించడమూ, జీవిత వైవిధ్యాన్ని గుర్తించి స్పందించడమూ చాలాఅవసరమేమో అనుకుంటాను. పాక్షికవాదులు జీవితంలో ఒక వైపే, ఒక భాగాన్నే చూసి ఎంతో విశిష్టమైన అనుభూతి ఆవరణని Miss అయి పోయారేమో అనిపిస్తుంది.

—తిలక్

'............అతిసుకుమారమైన ఆరోగ్యం. అందరిలాగా బాధల కత్తి అంచుమీద నడిచిన వాడినే - కన్నీటి వానలో తడిసినవాడనే. అయినా ఏదో అపూర్వమైన మాధుర్యం ప్రాణశక్తితో కలిసి నన్ను బతికిస్తూనే వుంది. ముందుకు నడిపిస్తూనే ఉంది.'

—తిలక్

కుందుర్తి

# "నువ్వు లేవు, నీ పాట వుంది"

ఒక నక్షత్రలోకంలో మహాప్రకాశవంతమైన తార రాలి పడిందన్నా, ఒక మేరువు విరిగిందన్నా, భూగోళం ఒరిగిందన్నా— ఏమన్నా ఉపమాన సామర్థ్యం చాలని తిలక్ మరణం గురించి, తిలక్ అనే ఒక అధునాతన కవి మరణించాడని సులభంగా చెప్పుకుంటే మంచిది. ఆధునిక తెలుగు కవిత్వపు ప్రస్తుత దశలో ఆయన మరణం శాఖోపశాఖలై పెరిగిన ఒక మహా వృక్షం పెను తుఫాను వాతబడి నేలకూలినట్లు— అరే, మళ్ళీ ఏదో ఒక అసమర్థోపమానమే వస్తుంది! ఎంతటి భాషాపుష్టి, భావపుష్టి గలవాడైనా యీ హఠాత్సంఘటనను వర్ణించలేడు.

ఆనాడు- ఆధునిక వచన కవిత్వం పులులమధ్య నడిచే లేడిపిల్లలా ప్రాణం గజగజలాడుతూ, అడుగులో అడుగు వేసుకుంటూ భయభయంగా ముందుకు పోదామని ప్రయత్నం చేస్తున్నప్పుడు, దానిని భుజాలపై ఎక్కించుకుని తిలక్ దర్పంగా ఠీవిగా నడుస్తూ, పథిశ్రమంలేని బాటసారివలె సునాయాసంగా ఆ మహారణ్య మార్గాలు గడచి అందమైన సుందర పురోద్యాన ప్రదేశానికి చేర్చాడు దానిని. ఒకమైలు పరుగు పందెంలో ప్రథముడుగా నెగ్గినందుకు బహుమతిగొన్న మరుక్షణం ఆనందాతిశయంతో హృదయమాగి అసువులు విడిచిన పందెగానివలె బాలగంగాధరతిలక్ మరణించాడు.

సవ్యసాచి:

అధునిక వచనకవిత్వానికి ప్రాణం పోసినవాడు తిలక్. అంతకుముందే ఒక మట్టిబొమ్మను దేవాలయంలో ప్రతిష్ఠ చేశారుగాని, అది తిలక్ వాణిస్పర్శ తగిలేవరకు పలకలేదు. ఆయన్ను చూడగనే కులుకుతూ, కేరింతలు కొడుతూ ఆటలాడింది. అదీ ఆయన ప్రత్యేకత. అజ్ఞాతవాసం రోజులు లెక్కించుకుని విజయదశమినాడు విల్లందుకున్న వివ్వచ్చుని వలె విజృంభించి కవితా యుద్ధభూమిలో వీర విహారం చేసి ఘన విజయాలు సాధించాడు. అప్పటికిగాని వచనకవిత్వానికి ఒక స్థాయి రాలేదు. ఒక గౌరవం లభించలేదు.

కవితా శిల్పజ్ఞుడు:

చెప్పడానికి "సరుకు" లేనివారు అధునిక కవుల్లో చాలామంది ఉన్నారు.

ఉన్నకొద్ది మందిలో తిలక్ పుష్కలంగా వున్నవాడు. అందులోనూ వ్యంగ్యవైభవంతో చెప్పగల కొద్దిమందిలో ఒకడు. వస్తువు ప్రేమకవితా సంబంధి గానీ, అభ్యుదయ భావము గానీ, అతిలోక సంబంధమైన విషయముగానీ, దానిని చెప్పే నేర్పు అతనికి అలవడినట్లు మరెవరికీ సమకాలికులకు అలవడలేదంటే అతిశయోక్తి కాదు. ఆయన కవిత చెప్పిన వైఖరి అటు సంప్రదాయజ్ఞులనూ ఆధునికులను కూడా సహజంగా సమ్మోహపరిచింది. పద్యమెంతపటువుగా వ్రాయగలడో ఆధునిక వచనగేయ మంత చక్కగా వ్రాసి చూపినాడు. ఆయన చేతిలో వృత్తము అనేకులు ప్రేమకవులు పోజాలని పోకడలు పోయింది. తెనుగు పద్యపు సొబగులు కుప్పమ్మరించింది. ఎత్తుగడ, నడక, ముగింపు— అన్నీ కాల్పనికయుగంలో వచ్చిన కవితాశిల్పము శిఖరస్థాయిని చేరుకున్న రూపములుగా ఆయన రసజ్ఞులను ఆశ్చర్యాంబుధి నోలలాడించాడు. అదే విధంగా వచన గేయం పరిమళభరితమైన బంగారపు తీగలా సాగి ఆయన పనితనపు సామర్థ్యానికి లొంగి సంప్రదాయ కవితావాదులతోసహా సమస్త రసజ్ఞుల కంఠాభరణమై వాసికెక్కింది. వచన పద్యం మాటే ఒంటికి సరిపడని పండిత కవులుసైతం తిలక్ శిల్పానికి తలకిందులైనారు. తదభిమానంగల ఆధునికులమాట సరేసరి.

## వచన కవిత ఒప్పించినవాడు:

సంప్రదాయ కవిత్వము, భావ కవిత్వము, అభ్యుదయ కవిత్వము, వచన కవిత్వము— అనే నాలుగు దశలలో ఆయన కవితారథం సాగింది. ఇరవయ్యోశతాబ్ది ప్రథమార్థభాగంలో తెలుగు కవిత్వపు వైఖరులలో వచ్చిన విప్లవాత్మకమైనమార్పులు అంతకుముందెన్నడూ, అంత త్వరత్వరగా రాలేదనే విషయం అందరికీ విదితమే.

ప్రపంచంలో శరవేగంతో జరిగిన రాజకీయ, సాంఘిక విప్లవాల ప్రభావం పడడంవల్లనేమి, ఆంగ్లభాషద్వారా పరభాషా సర్వ కవితారీతుల పరిచయం ఏర్పడడం వల్లనేమి, తెనుగు కవితారంగంలో కూడా అనేక మార్పులు వచ్చినవి. వీటన్నిటి ప్రభావం ఆనాటి కవులపై ప్రసరించక తప్పదు. ఏ ఒక పద్ధతికి కట్టుబడివుండక పోవడం లోపమని తిలక్‌ను గురించి నాకొకసారి వినిపించిన విమర్శ అర్థరహితమైనది. ఆయుగానికి చెందిన అస్మదాదులందరికీ యీ బహుముఖ కవితారీతుల ప్రదర్శనాపేక్ష ఉండడం సహజం. అది లోపము కాకపోగా ఒకవిధంగా ఆదరణీయమైన లక్షణమే. సంప్రదాయ కవితా రీతులనుంచి మారి ఆధునిక కవిత్వం వైపు మరలిన కొద్దిమంది కవులకే యీనాటికైనా ఆధునిక కవితారంగంలో ప్రజాదరణ లభిస్తూఉండడంగమనార్హం. ఎందుకంటే వారికి, కవిత్వము వ్రాయడానికి తగిన వ్యుత్పత్తి, ప్రతిభ, సాధనాబలం

మొదలైన లక్షణాలు వుండడంచేత. వచనకవిత్వం రాసినా, తిలక్‌వలె రాణించడానికి అవకాశం వుంది. అంటే వచన కవిత్వాన్ని సైతమొప్పించడానికి తగిన కవితాసంస్కృతి వారికి వుంది.

## భాష — భావము:

అభ్యుదయ కవితాయుగంలో కావ్యవస్తువు కొన్ని పరిధులకు లోబడి కొన్ని నిర్దిష్ట అంశాలకు మాత్రమే పరిమితమై పోయింది. దాని పరిధిని విస్తృతపరచి, సర్వజీవితరంగాలకు వ్యాపింపజేయాలనే ప్రయత్నం వచనకవితాయుగంలో ప్రారంభ మయింది. అన్నిరసాలను వ చ న క వి త్వం లో ఒప్పించాలనే అస్మదాదుల ఆకాంక్షకు తిలక్ ఉదాహరణప్రాయమైన కవిత్వం రాశాడు. ప్రేమకవితకు కొత్త జీవం పోశాడు. వచనకవిత్వంలో అభ్యుదయ భావనలు రాసినా, ప్రణయభావన చేసినా, మరొకటి చేసినా, ఆయన ప్రతి దానిలో సంపూర్ణ శక్తి సామర్థ్యములు కల కవిగా భాసించాడు. అంతేకాక అభ్యుదయ కవితాదశలో కావ్య వస్తువుకు మాత్రమే అత్యంత ప్రాధాన్యమేర్పడి, కవిత్వ విలువలకు అప్రాధాన్య మేర్పడినందువల్ల ఆరీతి కవిత్వం ఏ ఒకరిద్దరి విషయంలోనో తప్ప అంతగా ప్రజాదరణ పొందలేకపోయింది. ఈ లోపాన్ని సరిదిద్దటానికో అన్నట్లు తిలక్ తన అభ్యుదయ భావాలకు కవితావిలువల దృష్ట్యా నిలువదగిన భాషా, భావశక్తిని జోడించి కృతకృత్యుడైనాడు. కాల్పనికోద్యమ కాలంలో వచ్చిన నూతన శబ్దశక్తిని, సౌందర్యాన్ని ఆయన వచన కవిత్వంలో విజయ వంతంగా ప్రదర్శించి చూపినాడు. అభ్యుదయ భావన, కాల్పనికోద్యమపు శబ్ద సౌందర్యము— యీ రెంటి మేళవింపు అతని కవితావిజయానికి ప్రధానకారణం.

## స్పష్టతే అలంకారము:

తిలక్ కవిత్వంలో కొట్టవచ్చినట్లు కన్పించే మరొకలక్షణం స్పష్టత అదే ఆయన కవితకు నిజమైన అలంకారంగా భాసించింది. ఇటీవలి ఆధునిక కవిత్వంలో వస్తూన్న అయోమయ పదగుంఫనకు, తిలక్ కవిత్వంలోని సుస్పష్టత సరియైన సమాధానము. ఏనాటికైనా స్పష్టత లేని కవిత రాణించలేదు. పఠితహృదయంమీద ముద్ర వేయలేదు. విస్పష్టమైన భావజాలంతోనే, రసజ్ఞ లోకాకర్షకంగా వ్యంగ్య వైభవాన్ని ప్రదర్శించగల నేర్పు తిలక్‌కు ఉంది. ఇది మహాకవిత్వ లక్షణము.

కవిత్వం కొద్దిగా రాసినా ఎక్కువ రాసినా తన సొంతమని చెప్పుకోదగిన శైలిని సంతరించుకోలేనివాడు సాహిత్య చరిత్రలో నిలదొక్కుకోలేడు. తిలక్.

ఇటీవలివారిలో సొంత శైలిని నిర్మించుకున్న బహు కొద్దిమందిలో ఒకడు. కొన్ని పంక్తులు చదివి వినిపిస్తే, బహుశః యివి తిలక్‌వి అయివుంటాయనే అనుమానమైనా మనకు కలుగుతుంది.

అభ్యుదయ కవి:

తిలక్ ఎన్నిరకాల కవితారీతులను పరిదర్శించినా ఎన్నిరకాల కథావస్తువు లను స్వీకరించినా నూటికి నూరుపాళ్ళు అభ్యుదయ భావన జీర్ణించుకున్న కవి. అతని మీద అభ్యుదయ కవితాయుగపు భావజాలమే చెరగని ముద్రి వేసినది. విశేషంగా మానవతావాది. అభ్యుదయ కవితాయుగంలో ఉవ్వెత్తుగా లేచి సర్వదిశాక్రిమణ చేసిన అంతర్జాతీయ భావన అతన్ని ఆవేశించింది. ఇతర దేశములలో జరిగిన హృదయ విదారక సంఘటనలు, యుద్ధములు, రక్తపాతము అతని హృదయాన్ని కదలించినవి. కథావస్తువులుగా అతని కావ్యములనిండా పరచుకొన్నవి. "సంకుచితమైన జాతిమతాల సరిహద్దుల్ని చెరిపివేసి" "అకుంఠిత మానవీయ పతాక ఎగురవేసిన" అభ్యుదయ కవి కంఠమతనిది. ఉత్తర ధృవాన ఒకపాదము, దక్షిణ ధృవాన ఒక పాదము ఉంచి త్రివిక్రముని వలె పెరిగి కవితారాజ్యమును పాలించినవాడు తిలక్. ఎవరెస్టుకన్న ఎత్తైన అతని ఊహాశిఖరాన్ని చేరుకోవడం సాధ్యం కాదని తనే చెప్పుకొన్నాడు. సింధూరంకన్న ఎరుపైన అతని హృదయాన్ని చదవడంకూడ అంత కష్టమే.

సజాతీయత:

తన కవిత్వము గ్రింధరూపములో రాకముందే యావదాంధ్రి ప్రిజల నాకర్షించి సమకాలిక సాహితీ రంగంలో పేరుప్రితిష్ఠల నార్జించుకున్న ఆధునిక కవుల్లో శ్రీ శ్రీ తరువాత చెప్పుకోదగినవాడు తిలక్. ఇటువంటి శక్తిసామర్థ్యాలు కొద్దిమందికి మాత్రిమే ఉంటాయి. ఆంగ్లభాషా ప్రిభావం పడిన ఆధునిక కవుల్లో కొందరు చేసే భావన, వాడే పదజాలం విజాతీయతకు చాలా దగ్గరలో ఉండడం కద్దు. ఆ కారణం వలననే ప్రిజలకు దూరమవడం కూడ జరుగుతుంది. తిలక్ దారి వేరు. ఎన్ని ఆంగ్ల కవితారీతులను చదివి ఆకళింపు చేసుకున్నప్పటికీ అతని భావము, భాష సజాతీయమైనవి. భారతీయ సంస్కృతి పరిధి దాటనివి. అందుకే అతన్ని పాఠకులాదరించారు.

తెనుగులో వచన కవితా వికాసాన్ని గాఢంగా కాంక్షించి దానికై యథాశక్తి కృషి చేసేవారిలో ఒకడనైన నాకు తిలక్ పరమాప్తకోటిలోని వాడు. తోడుగా, యీ

కృషిలో నిలబడి మరికొంతకాలం సహాయ పడతాడని ఆశించాను. కాని దైవమన్యథా చేసినాడు.

"నువ్వులేవు నీపాట వుంది" అనే శీర్షికతో తిలక్ ఒకచక్కని ప్రేమ గీతాన్ని రాశాడు. ఈ వ్యాసానికి ఎంత వెదికినా యింతకంటె మంచి శీర్షిక దొరకలేదు. అదే సార్థకంగా వుంది.

* * *

''చావు పుట్టుకల మధ్య సందేహంలాంటి
జీవితంలో నలువైపులా అంధకారం
మంచిగంధంలాగ పరిమళించే మానవత్వం
మాతున్న ఒకేఒక అలంకారం.''

—తిలక్.

''దేశానికి హద్దులూ, ప్రవర్తనకి ఎల్లలూ
ఆవేశాలకు మితీ, కావేశాలకు పరిమితీ
అవసరం మానవ సౌఖ్యానికీ, సఖ్యానికీ
అందుకే అనాదిగా, చరిత్రకు పునాదిగా
పొందుపరిచారు జాతికీ, వ్యక్తికీ స్వతంత్రం''

—తిలక్.

''మురికి కాల్వమీద, ముసలితనంమీద, మృషాజగతిమీద
మహోదయం వికసించదు, వసంతం హసించదు!''

—తిలక్.

అద్దేపల్లి రామమోహనరావు | # అనుభూతివాది తిలక్

"అన్నా! కవిత్వం అంతరాంతర జ్యోతిస్సీమల్ని బహిర్గతం చెయ్యాలి
విస్తరించాలి చైతన్య పరిధి
అగ్ని జల్లినా అమృతం కురిసినా
అందం ఆనందం దాని పరమావధి...."

"నవత - కవిత" అనే వచన గీతికలో తిలక్ వ్రాసిన పంక్తులివి. ఈ పంక్తుల్లో అతను రాను రాను కవిత్వ పరమార్థంగా ఏవిషయాన్ని భావించాడో ప్రత్యక్ష మౌతున్నది. ఉపదేశాల్ని, నినాదాల్ని, సిద్ధాంతాల్ని దాటి చూడగల్గిన ఒక రసదృష్టి ఈ పంక్తుల్లో వ్యక్తమౌతున్నది. ఆధునిక కవులలో అతడు ముఖ్యంగా సాధించినదీ మహావిషయం. నేటి కవులలో ఎక్కువమంది ఏదో ఒక ప్రత్యేకమైన విషయానికి లేదా సిద్ధాంతానికి దాసులు. వారు ఏ కవిత్వం రాసినా తమస్వీయ సిద్ధాంత నిరూపకంగానే ఉంటుంది. అదీగాక సిద్ధాంతనిరూపణమే కవితా పరమార్థమనేవాళ్ళు గూడా చాలామంది ఉన్నారు. తన భావానికి వ్యతిరిక్తమైన భావం, ఎవరెంత గొప్ప కవిత్వం చెప్పినా మెచ్చుకోలేని ఒక స్థితి నేటి సాహిత్యంలో యెక్కువగా వ్యాపిస్తున్నది. అంచే అచ్ఛమైన కవితాసౌందర్య రసాస్వాదనకి దూరమౌతున్నది నేటి విమర్శన రంగం. ఇంత కల్లోలమైన ఉద్దేశాలుగల నేటి కవితారంగంలో తిలక్ గొంతు విశిష్టమైన రాగాన్ని వినిపిస్తున్నది. "కవిత్వం అంతరాంతర జ్యోతిస్సీమల్ని బహిర్గతం చెయ్యాలి" అన్నది అతని కవితానుభూతి పారమ్యానికుదాహరణ. అగ్ని జల్లినా, అమృతాన్ని కురిపించినా, లోలోపలి నాదాల్ని వినిపింపజెయ్యడమే కవిత యొక్క లక్ష్యం. మనస్సు పైపొరల్ని మాత్రమే స్పందింపజేసే భావాలకు తిలక్ ప్రాముఖ్యమివ్వడం లేదు. మనస్సు లోపలి పొరల్ని బహిర్గతం చెయ్యడమే కవితా రసానుభూతి పరమ ధ్యేయమనే నిర్ణయానికి వచ్చాడతడు. ఈ భావన క్రితం తరంలోని భావకవుల దర్శనానికి సన్నిహితమైనది. కాని ఒక భేదం ఉన్నది. భావకవుల సర్వ కవిత్వమూ ప్రియాభిముఖంగా సాగింది. వారు ప్రేయసి కన్నులలో అనంతాంబరపు నీలినీడల్ని చూడగలిగారు గాని, సర్వానుభూతులనీను క్షితిజరేఖ వెనుక స్పష్టాస్పష్టమైన వెలుగులు చూడడానికి యత్నించలేదు. ఇక, రవీంద్రనాథ ఠాకూరుయొక్క రచనా ఫక్కిక దైవాన్వేషణా ప్రధానమైనది. సృష్టియంతనీ అద్వైతభావాభిముఖంగా చూచి, ఉపనిష

రహస్యాల నీలి నీడల్ని ప్రపంచంమీద పఱచేది ఆ కవితారీతి. కాని, తిలక్ ప్రయత్నించింది, ఏభావాన్ని చెప్పినా అందులో తన మనస్సులోని పాతాళ గంగల్ని పదాలుగా మార్చాలని. మనస్సుయొక్క లోతులలోని అనుభూతుల్ని కవిత్వంగా అనువదించాలన్నది అతని ప్రధాన లక్ష్యం. అందుకే ఇతని రీతిని అనుభూతి వాద మనవచ్చును. ఈతనివలె అనుభూతి రహస్యాల్ని రూపు గట్టాలని చూచినవారు ఆధునిక కవులలో చాలా తక్కువ. ప్రయత్నించిన వాళ్ళలోనూ, కొంతమంది ఒకటి రెండు రచనల్లో సాఫల్యం పొందగా, కొంతమంది అనుభూతిని సరిగ్గా రూపు గట్టలేక అయోమయత్వానికి అర్థంకానితనానికి, గజిబిజికీ పాలైపోయి, పరాజితు లయ్యారు. తిలక్‌ది మాత్రం ఈరీతిలో మహాపరిణతి మార్గంలో పయనిస్తున్న ప్రతిష్ఠ గమనం. ఉదాహరణకి "నేనుకాని నేను" అనే ఒక గేయంలో అతడు, కవిత వ్రాయడంలో లీనమైన ఒకానొక మనస్స్థితిని వెలువరించ దలచుకొన్నాడు. అనితర సాధ్యమైనవిధంగా ఆ అనుభూతిని చదువరులలో కలిగించ గలిగాడతడు.

"ఒక నిశార్ధభాగంలో నక్షత్ర నివహ గగనం
ఒరగా భూమ్మీదకు వొంగి ఏదో రహస్యం చెబుతున్న వేళ"

అనే మొదటి పంక్తుల్లోనే (అనుభూతికి మొదటి పంక్తులు. గేయానికి కాదు) కవితారచనా పారవశ్య లక్షణాన్ని, నక్షత్రాలతో కలసిన ఆకాశం భూమ్మీదకు వొంగి రహస్యం చెప్పటమనే సంకేతం ద్వారా సాధించాడు. అందులోనూ "రహస్యం" చెప్పటమనే పదం చాలా ప్రధానమైనది. అందులోనే మనస్సులోని నిశ్శబ్ద్ధస్థితి వ్యంజన ఉన్నది. ఇట్లా బయటి ప్రకృతిగతమైన వస్తువుల్ని వర్ణిస్తూ, ఆ వర్ణనలోనే అనుభూతిని సంకేత రూపాన జోడించి, ఆ అనుభూతి, మనోంతర్గత రహస్య వక్తీ కరణరూపంగా ఉండేటట్లు మలచబడిన యీ గేయం, ప్రకృతికీ, కవితాపరవశితమైన మనస్సుకీ కవి రహస్యాలతో నిర్మించుకున్న వంతెన లాంటిది. T. S. Eliot చెప్పి నటువంటి "Objective Correlative" అన్న సిద్ధాంతానికి ఉదాహరణ పూర్వకంగా నడుస్తుంది యీ గేయంలో ప్రకృతి వర్ణన. బయట వస్తువుని వర్ణించే విధానంలోనే కవి మనోంతర్గతావేశం వ్యంగ్యం కావాలి.

"ఎదురుగా గోడ మీద బల్లి ఏకాగ్రంగా నాకేసి చూస్తూ ఉంటుంది"

"కిటికీ అవతల ఫెరన్ మొక్క క్రీగంట కనిపెడుతూ ఉంటుంది"

"కీచురాళ్ళ చప్పుడు అప్పుడప్పుడు వినిపిస్తూ ఉంటుంది"

ఈ పై పాదాల్లో కీ్రిగీత ఉంచిన పదాల ద్వారా ప్రకృతిలో లీనమైన కవి మనః పారవశ్య స్థితి వ్యంగ్యమౌతుంది.

తరువాత ఇంకా కొన్ని విచిత్ర సంకేత పూర్వక భావాలచేత తన అనుభూతిని వెలికి తోడ యత్నిస్తాడు కవి.

"నాలోపల ఎవరో చప్పున ఇటు నుంచి అటువైపు వెళ్ళిపోతూ
ఆనవాలుగా వదులుతారు ఇరవై ఏళ్ళనాటి జ్ఞాపకాల్ని"

లోపల "ఇటునించి అటువైపు ఎవరో వెళ్ళిపోతూ జ్ఞాపకాన్ని వదలడమనే భావన — మనోంతరాన హఠాత్‌స్ఫురితమైన కవితా స్ఫూర్తికి వ్యక్తీకరణ.

"నా గది అవతల ఎవరో నవ్వుని నొక్కిపట్టిన ధ్వని నీళ్ళని కలచినట్లు
రోదసిలో చీకటిలో అంతర్హిత సంగీతం తాలూకు శ్రుతి చుట్టుకొన్నట్లు"

ఈ పై పాదాల్లోని సంకేతాలు గూడా కవి మనస్స్థితికి ప్రతిబింబాలు. "గది అవతల నవ్వుని నొక్కిపట్టిన ధ్వని" కవితా రచనా సమయాన కవి, తన అంతరాంతర నాదాన్ని రహస్య సంగీతం లాగా వినడం స్ఫురిస్తోంది. రెండో పాదంలో కవి యింకా లోతులకి వెళ్తున్నాడు. రోదసి, చీకటి, అంతర్హిత సంగీతం చుట్టుకొనడం— కవి తన లోతుల్లో తాను ఇంకా ఇంకా కరిగిపోవడానికి సంకేతాలుగా ఉన్నై. అప్పుడు కవి యింకా పరవశ స్థితిలోకి కూరుకుని పోయాడు. ఆ స్థితిని చెప్తున్నాడు అనుభూతి సత్యస్థితి దర్శనానిష్ఠుడైన తిలక్: సముచిత సంకేత రూపక రహస్య భావనా సమగ్ర వ్యక్తీకరణ సమర్థుడైన తిలక్.

"మంచూ మసక వెన్నెలా కలిసిన
శీతాకాలపు రాత్రి గుండెల మీద
మరకలా పడుతుంది నా నిట్టూర్పు
ఏకాంతం మీద నా తీర్పు"

"మంచూ, మసక వెన్నెలా కలిసిన శీతాకాలపు రాత్రి" గూడా కవి మనస్సు యొక్క వ్యక్తావ్యక్త స్థితికి సంకేత రూపమైనది. అటువంటి రాత్రి గుండెల మీద కవి నిట్టూర్పు వాలుతుంది. ఆ నిట్టూర్పు, కవితావేశపరమదశానుభూతి జనితమైన నిట్టూర్పు. అది ఏకాంతం మీద తీర్పు. అంటే ఏకాంత స్థితికి వ్యాఖ్యాన ప్రాయమైనది. తనలో తానేకమైన అద్వైత స్థితికి నిరూపకమైనది.

అట్టి స్థితి వెళ్ళిన తర్వాత ఇక భావనతెరలు జారిపోయి, ఈ లోకంలో పడి పోతాడు కవి. ఆ స్థితిని తిలక్ అతి సమర్థతతో వ్యంగ్యం చేస్తాడు. గేయం మొదట ఏ వస్తు సామగ్రిలో పరవశ స్థితి ధ్వనితంగా రచించాడని చెప్పానో, అదే సామగ్రి నిప్పుడు జారిపోయిన స్థితి ధ్వనించేటట్లు వ్రాస్తాడు.

"గోడ మీద బల్లి విసుగ్గా వెళ్ళిపోయింది
ఫెరన్ మొక్క నిద్రపోయింది
ఆకాశం నక్షత్రాన్ని జారవిడిచి అంత ఎత్తుకు ఎగిరిపోయింది
నా చుట్టూ ఉన్న తెరలు జారిపోయాయి"

ఇట్లా మొదటా చివరా ఒకే వస్తువుల్ని భిన్నదశా వ్యంజకంగా రచించి, గేయానికి ఒక విచిత్ర సమగ్రత సాధించాడు తిలక్. తర్వాత అంటాడు—

"నాకు నిజంగా మెలకువ వచ్చింది"

ఈ మాటతో పాఠకునిలో కూడా గభాల్న గేయంలో నుంచి మేలుకొన్న స్ఫూర్తి కలుగుతుంది. చివరి పాదం యిది.

"కిటికీలోంచి శిశిరర్తు క్షీణ చంద్రరేఖ
గిలగిల్లాడినట్లు కనిపించింది."

క్షీణ చంద్రరేఖ గిలగిల్లాడడం— పారవశ్యం నుండి మేల్కొన్న కవి, లౌకిక సామాన్య స్థితిని సహించలేకపోవడానికి సంకేతం.

ఈ విధంగా చుట్టూ ఉన్న ప్రకృతిలోనే తన ఆవేశాన్ని ధ్వని రూపంగా వర్ణిస్తూ, సంకేతాలద్వారా తన పారవశ్యాన్ని నిరూపించిన యీ గేయం, తిలక్ యొక్క కవితా పరమార్థభావనకి సంపూర్ణోదాహరణం. "అంతరాంతర జ్యోతిస్సీమల్ని బయటకు తేవడమనే ఒక నూత్నమైన మార్గాన్ని అతడు ఎంత విచిత్ర రీతితో సాధించు కున్నాడో మనం గ్రహించగలం. ఈ మార్గానికి "అనుభూతి వాద"మనే పేరు సము చితంగా తోస్తుంది,

మనోంతరాల నుండి అనుభూతిని తోడటంలో తిలక్ ది ఒక ప్రత్యేక మార్గం. అతను అనుభూతిని ఎక్కడా అస్పష్ట గగనంలో కనబడకుండా కరిగిపోనివ్వడు. హృద యపు దిశల చివరల సన్నని మబ్బులుగా వ్రేలాడే అనుభూతుల్ని విశాల పరిధిలోనికి

గొనివచ్చి ఘనీభవింపజెయ్యాలని ప్రయత్నిస్తాడు. అందుకే అతడు "నవత–కవిత" అనే గేయంలో చెప్తాడు.

> "కవిత్వంలో obscurity కొన్ని సందర్భాల్లో ఉండొచ్చును
> కాని పాఠకుడికి నీ అనుభూతి ఆకారం అందాలి హత్తుకోవాలి
> అది Transparent చీకటై ఉండాలి, నిన్ను పలకరించాలి
> కవిత కొత్త అనుభవాల కాంతి పేటికను తెరవాలి, కదిలించాలి"

Transparent చీకటి అన్న పదం ఈ పంక్తులలోని ప్రధాన భావం. గాఢానుభూతులు చీకటిగా తప్ప వెలుతురుగా చిత్రించడానికి సాధ్యపడదు. అనుభూతి కవులందరికీ యిది తెలిసిన విషయమే. కాని, ఆ చీకటి Transparent గా ఉండాలనడంలో తిలక్ యొక్క నిశిత పరిశీలన ఉన్నది. ఉదాహరణకి అతడు వ్రాసిన "ఒక శ్రుతి" అనే గేయంలో "దూరదూరాల్లో రేఖగా, పొలిమేరగా కరగినిల్చిన తనలో వినబడే" ఒక శ్రుతినతడు పలికించడానికి ప్రయత్నిస్తాడు. ఇది చాలా లోతైన భావన. అంటుకోగానే పారిపోయే పాదరసంలాంటి అనుభూతి. దాన్ని పదాలతో రూపు గట్టి పాఠకుణ్ణి అనుభవింపజెయ్యాలి. చాలా మంది ఆధునికులలో అట్టి భావన పాఠకుల మనో నేత్రానికి చీకటిగానే కనిపిస్తుంది. ఆ చీకటి తెరను చీల్చుకొని పోవడానికి, హృదయపు కళ్ళను ఎంత పొడుచుకున్నా సాధ్యంకాదు. ఎందుకంటే, వ్రాసే కవికి తన భావనా మార్గం తెలుసు. అందుకని చీకటి పథాల మీద గూడా నడిచిపోయి తన అనుభూతిని అందుకోగలడు. కాని, కవి మనో మార్గం, పాఠకునికి తెలియదుగదా! అందుకని, కవి తన మనస్సులోని చీకటికి ఒక వెలుగు రేఖని జోడించాలి. ఆ చీకటిని Transparent చెయ్యాలి. కవి ఉపయోగించే వెలుగురేఖలే ఆలోచనగల పాఠకుడికి అందే సంకేతాలు, కవితా శిల్ప రహస్యాలూ. ఇక్కడ తిలక్ చేసిన శిల్పాన్ని పరిశీలిద్దాం. ఇందులో తిలక్ దైవానికీ తనకూ మధ్యగల దూరాన్ని గుండెతో కొలుచుకున్నాడు. అప్పుడు వినబడేది దూర దూరాల శ్రుతి.

> "చెరగి
> నేను పుట్టిన పురిటి నొప్పుల చీకటి చార;
> చెరగి
> నేను నశించు చావు సంజెల నెత్తుటి చార;
> చెరపికొని నీ మధ్య నా మధ్య గల దూరపు రేఖ"

పురిటి నొప్పుల చీకటి చార చెరిగిపోవాలి. అప్పుడు కవికి ప్రారంభాన అనంతత్వం ప్రాప్తిస్తుంది. చావు సంజెల నెత్తుటి చార చెరగిపోవాలి. అప్పుడు అతనికి అంత్యాన అనంతత్వం ప్రాప్తిస్తుంది. ''పురిటి నొప్పుల చీకటి చార'' అనడంలో మానవ జన్మలోని వేదన, జన్మ పూర్వమైన అనంత తిమిరాలూ దర్శనమిస్తున్నవి. ఇట్లా అనంత వేదననీ, అజ్ఞాత తిమిరాన్నీ పాఠకుడి అనుభూతికి తేవడానికి ''పురిటి నొప్పుల చీకటి చార'' అనే పదాన్ని వాడడమే చీకటిని Transparent చెయ్యడం. ఇల్లాంటి అనుభూతిని చెప్పడానికి మరొక సామాన్య కవి చాలా అయోమయత్వ అఖాతంలో పడిపోయే అవకాశం ఉన్నది. ఇక్కడే ''దూరపురేఖ'' అనే పద సంఘటన చాలా ప్రతిభాద్యోతకమైనది. దూరాన ఉన్న రేఖ— అని కాదు దీని అర్థం. దూరము అనేటటువంటి రేఖ. మానవుడు దైవానికీ ఒకేసారి అనంత దూరంలోనూ, అమిత సమీపంలోనూ ఉన్నాడు. చీకటివంటి ఈ భావాన్ని రూపు కట్టేదెలా? ఒక మహావ్యంజకశక్తినుపయోగించాలి. రేఖ—అంటే చాలా సన్నని గీత కనిపిస్తుంది. దూరాన్ని రేఖతో రూపకం చెయ్యడంలో, దూర తీరాలు సమీప ప్రదేశాలతో సమాసాన్ని పొందినై. అందుకని ఒకేసారి దూరాన్ని సమీపానికీ, సమీపాన్ని దూరానికీ తీసుకుపోగల శక్తిని ప్రదర్శిస్తోంది ''దూరపు రేఖ'' అనే సమాసం. ఇటువంటి అద్భుత శిల్పాన్ని తిలక్ తనదైన ఒక నవ్య మార్గంలో విచిత్రంగా సాధించుకోగలిగాడు. ''కవిత కొత్త అనుభవాల కాంతి పేటికను తెరవాలి'' ఇది తిలక్ కవిత ద్వారా అందుకోదలచిన పరమాదర్శం. కొత్త అనుభూతుల్ని చెప్పాలి. ఎప్పటికప్పుడు వినూతన అనుభవాల్ని అందించడమే కవికి ధ్యేయం కావాలి. ఇది నిరంతరాన్వేషణాదృష్టి. జీవితపు లోతుల్ని కవిత్వంగా పఱచడానికి చేసే నిరంతరసృష్టి.

అనుభూతుల అగాధ సీమలమీద పఱచిన అమోఘమైన హృదయదీపం "నువ్వు లేవు నీ పాట ఉంది" అనే గేయం. ఇంటిముందరి ఉద్యానవనంలో చిన్ననాడు తానుభవించిన ప్రేయసీ సమాగమానుభూతి యొక్క అతిదూర స్మృతి వేదన ఈ గేయంలో వస్తువు, దీనిని కవి ఈవిధంగా ప్రారంభిస్తాడు.

"నువ్వు లేవు నీ పాట ఉంది
ఇంటిముందు జూకామల్లె తీగల్లో అల్లుకొని
లాంతరు సన్నని వెలుతురులో కప్పుకొని నా గుండెల్లో చుట్టుకొని
గాలిలో ఆకాశంలో నక్షత్రం చివరి మెరుపులో దాక్కొని
నీరవంగా నిజంగా వుంది
జాలిగా హాయిగా వినబడుతూ వుంది
శిశిర వసంతాల మధ్య వచ్చే మార్పుని గుర్తుకి తెస్తోంది"

చిన్ననాడు తన కౌగిలిలో పాడిన ప్రేయసిపాట యొక్క అనుభూతి అతని హృదయంలో ఎట్లా స్పందించిందో ఈ పంక్తులు పలికిస్తై. వారి సమాగమ సమయానికి వాతావరణంగా ఉన్న జూకా మల్లె తీగలో, లాంతరు సన్నని వెలుగులో, అతని గుండెల్లో ఆ పాట నిండిపోయింది. అంటే, ఆ సమయంలో ఆ పాట, వాతావరణం, అతని గుండెలూ, ఒకే అద్వైత సముద్రంలో సంగమించిపోయినై. కాని యీనాటికి ఆస్మృతి అనిర్వచనీయ వేదనాసహితమైనది. ఆ వేదనలోనే తీయదనం కరిగిపోయి ఉన్నది. దానినే ప్రకృతిలో అతి సమర్థంగా ధ్వనింపజేస్తాడు తిలక్. గాలిలో, ఆకాశంలో, నక్షత్రం చివరి మెరుపులో దాక్కున్నది ఆ పాట. కవి అనుభూతి గాలిలో నిండింది; ఆకాశాన్ని పలకరించింది. "నక్షత్రం చివరి మెరుపులో" అన్నది విషాదపు జీరకి సంకేతమౌతుంది. అందుకే ఆ పాట ఈనాటికి "జాలిగా" వినబడుతోంది. పైగా అది శిశిర వసంతాల మధ్య మార్పువలె ఉన్నది. శిశిరం విషాదం, వసంతం ఆనందం. ఈ రెంటికీ మధ్య, విషాదానందాల మధ్య మార్పు; అంటే వేదనని పిలిచే ఆనందం, ఆనందానికి చేతులు చాచే వేదన, రెండూ కలిసిన రేఖ, ప్రస్తుత కవి యొక్క స్మృతి.

> "తచ్చేతసా స్మరతినూనమబోధ పూర్వం
> భావస్థిరాణి జననాంతర సౌహృదాని"

అన్న పంక్తుల రహస్యం ఇక్కడి కవి యొక్క అనుభూతి. వాతావరణమంతనీ, తన స్మృత్యనుభూతితో ధ్వని ప్లావితం చెయ్యడం తిలక్ కవితలోని పరమ రహస్యం. తన సమ్మోద వేదనా సమ్మిళితానుభూతిని ప్రకృతిలో ఈ విధంగా పలికిస్తున్నాడు.

> ఇన్నేళ్ళ తర్వాత వేడిగాలి చల్లదనానికి తిరిగే
> ఒకానొక గ్రీష్మ దివసావసాన సమయాన డాబామీద
> సిగ్గిలిన సోగకళ్ళతో మల్లెపూల వాల్జడతో నువ్వుపాడిన పాట
> నాగుండెల దగ్గర తడబడుతూ ఏదో కొత్తభాషలో చెప్పి,
> ఒక అందమైన రహస్యం విప్పి, పరువానికి వస్తున్న నా వయస్సులో
> చటుక్కున పరిమళపు తుపానుల్ని రేపి
> మహారణ్యాల సౌందర్యాన్ని చూపి
> సముద్రపు కెరటాల బలంతో మధ్యగా మౌనంగా ఉన్న ద్వీపాల్ని ఊపి
> ప్రపంచంయొక్క అవధుల్ని దూరంగా సాచి నన్ను దిగంతాలకి విసిరేసినవేళ"

'వేడిగాలి చల్లదనానికి తిరిగే గ్రీష్మ దివసావసానం'లో గూడా, అనుభూతి సంకేతం ఉంది. అనాటి తీవ్రానుభవం మందగించి ఘనీభవించిన సూచన ఉంది. ఆ తర్వాతి అనుభూతి వర్ణనలో ఇందాక నేను చెప్పిన, చేదైన తీయదనపు వ్యంజన నిండుగా ఉంది. గుండెల దగ్గర పాట తడబడటం, పరిమళపు తుఫానులు, మహారణ్యాల సౌందర్యాలు. (అరణ్యంయొక్క సౌందర్యం కాదు. ఇక్కడ అర్థం: సౌందర్యంతో అరణ్యం రూపకం చేయబడింది) మౌనంగా సముద్రాలమధ్య నిలబడిన ద్వీపాలు; ఇవన్నీ పైన తెలుపబడిన వేదనామయ మాధుర్యానికి ప్రతీకలే. ఈ విధమైన రచనాశిల్పాన్ని న భూతో నభవిష్యతిగా నాడు పాడింది భావకవితాశాఖాగ్రిజ్వాల కృష్ణశాస్త్రి; నేడు పాడింది వచనకవితా భావోగ్రికీల తిలక్.

సాధారణంగా పరిపక్వమైన ప్రత్యేక దృష్టిగల రచయిత, తానువ్రాసే రచనల్లోనే, భావానుగతంగా, అక్కడక్కడ తన భావాల్ని జతచేసి, రచనమీద తనకుగల ప్రత్యేక సిద్ధాంతాన్ని ధ్వనితం చేస్తాడు. "ఏకోఽసః కరుణఏవ" "రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్" ఇత్యాది శ్లోకాల కవుల వద్దనుండి ఈనాటి కవులందరిదాకా యీ సంప్రదాయమున్నది. బాలగంగాధర తిలక్, అచ్చమైన కవి. అతనికి కవితలోని వాదాల మీదగాని, ప్రత్యేక సాంఘిక సిద్ధాంతాలమీదగాని, వ్యక్తిగత విశిష్ట రాద్ధాంతాల మీదగాని విశ్వాసం లేదు. మనస్సులోని పై పొరల ఉద్రేకాలకు సంబంధించిన ఈ విషయాల నేలనుండి, విశిష్ట హృదయానుభూతుల నింగి మీదకెగిరి, దూర దూరాల తారల్ని అరచేతిలో నిలబెట్టుకోవాలని అతని నిరంతర తపన. తన ఈ నిత్య రసదృష్టిని అతడనేక గేయాల్లో అనేక రీతుల్లో వెలువరిస్తాడు. ప్రస్తుత గేయంలో పైన పేర్కొన్న పంక్తుల తర్వాత యిట్లా అంటాడు.

> "ఇజాలూ, రాజకీయాలూ, వాదాలూ, హత్యలూ, యుద్ధాలూ
> ఇటువంటి చెత్తా చెదారం మనస్సులలో పేరుకోకముందు పండిన
> మొగలి పొత్తివంటి పరిమళంగల ప్రారంభ యౌవనపు నిండైన
> ఆరోగ్యపు వాకిళ్ళముందు విరిసిన నందివర్ధనం పువ్వుల మధ్య
> నువ్వూ నేనూ కూర్చొని అలాగ ఒకర్నొకరు చూసుకుంటూ
> ఆకాశానికీ భూమికీ మధ్య పడిన చిరు చీకటి పలకమీద
> రేడియమ్ అక్షరాల్ని వ్రాసుకుంటూ
> కాలాన్ని కదలకుండా నిలబెట్టి కమ్మని ఊహల పూల తోటల మధ్య"

ఈ రీతిగా, ఇంత లోతైన భావాన్ని వెలువరించడానికి రచనా శిల్ప రహస్యంగా, అతి దీర్ఘమైన వాక్యం ఇట్లా పెంచుకుంటూపోయి. సమస్త సృష్టికీ ఒకే ఒక

అస్తం కనుక్కున్న వేళ" అని అసంపూర్ణ వాక్యాన్ని ముగిస్తాడు. "ఆకాశానికీ భూమికీ మధ్య పడిన చిరు చీకటి పలకమీద, రేడియం అక్షరాల్ని వ్రాయడం"లో ఇంతకుపూర్వం నేను నిరూపించిన Transparent చీకటి అనుభూతమౌతోంది. తన అనుభూతికి ఇంకా కొన్ని పోలికలు చెప్పి, తర్వాత గేయాన్ని ముగించే శిల్పంలో సమగ్రత చూపిస్తాడు తిలక్. "నేను కాని నేను" అనే గేయంలోని శిల్పానికీ, దీనికీ సంబంధం ఉన్నది. గేయారంభంలో చెప్పిన వాతావరణాన్నే మళ్ళీ వర్ణించి, అవే పంక్తుల్ని పునరుక్తి చేసి, చివ్వరి పంక్తిలో ఒక మెరుపు చూపి, మొదటి పంక్తులే చివర చెప్పడంలో కవి హృదయంలో స్మృతి భారాన్ని అద్భుతంగా ధ్వనింపజేస్తాడు. ముగింపు ఇది—

"ఇంటిముందు జూకా మల్లె తీగల్లో అల్లుకొని
లాంతరు వెలుతుర్లో కప్పుకొని
నా గుండెల్లో చుట్టుకొని గాలిలో ఆకాశంలో
నక్షత్రం చివరి మెరుపులో దాక్కొని
నిరపంగా నిజంగా ఉంది—జాలిగా హాయిగా వినబడుతూ వుంది.
శిశిర వసంతాల మధ్య వచ్చే
విచిత్ర మధురమైన మార్పుని గుర్తుకి తెస్తోంది
యిన్నేళ్ళ తర్వాత...."

గేయం మొదట, శిశిర వసంతాల మధ్య వచ్చే మార్పు- అని మాత్రమే అన్నాడు. ఇక్కడ "శిశిర వసంతాల మధ్య వచ్చే విచిత్ర మధురమైన మార్పు" అన్నాడు. గేయం నిండా "విచిత్ర మాధుర్యాన్ని" నింపిన కవి, చివర తన ఉద్దేశ్యాన్ని పాఠకుడికి వ్యంగ్యం చెయ్యడానికి ఈ మాటని ఉపయోగించాడు. ఈ గేయం యొక్క నా వివరము అంతా ఈ "విచిత్ర మాధుర్యాన్ని" కనిపెట్టడానికే.

తిలక్, తన గేయాల్లో నింపిన అనుభూతుల్లో ఒక విశిష్టత ఉన్నది. ఏ అనుభూతినైనా సాధ్యమైనంత విశాలంగా, దిగంతాలకన్నా దూరంగా సాగదియ్యాలని చూస్తాడు. అంటే ప్రతి అనుభూతినీ ప్రపంచమంతా రెక్కలు చాచుకొన్నట్లుగా అనుభవించడానికి యత్నిస్తాడు. అతని వర్ణనల్లో చాలా తఱచుగా ఈ ప్రయత్నం దర్శనమిస్తుంది. అనేక పదబంధాల్లో గూడా ఈ విషయధ్వని ఉంటుంది. ఆధునిక సమాజ దౌర్భాగ్యాన్ని అనితరసాధ్య ధ్వనితో వర్ణించే "కఠోపనిషత్" అనే గేయంలో అధునాతన భావుకుని లక్షణాన్ని చెప్తాడు.

"కాలాన్ని సాగదీసి, సాగరాన్ని మథించి, ఖగోళాల నావర్తించి,
అధునాతన భావుకులు స్వప్న ఖడ్గాలు వర్తమాన శిరస్సుని వధించ
బోయే సమయాన"

ఇట్లా అతడు ఏ అనుభూతిని చెప్పినా, ఆకాశాలు, సముద్రాలు సాగదియ్యాలని ప్రయత్నిస్తాడు. "నేను కాని నేను" లో రహస్య భావాన్ని చెప్పేటప్పుడు "నక్షత్ర నివహగగనం ఓరగా భూమ్మీదకు ఒంగిన" దంటాడు. 'కిటికీ' అనే గేయంలో మనస్సు యొక్క దృష్టి వైశాల్యాన్ని మూర్తిగట్టేటప్పుడు–

"గదికీ మదికీగూడా గవాక్షాలుంటాయి
అంతరిక్షంలోకి, జీవిత రహస్యంలోకి సృష్టి సమక్షంలోకి

విచ్చుకునే విచిత్రాక్షి సమూహాలు" అంటాడు.
"అదృష్టాధ్వ గమనం"లో

"అప్పుడు నా వీపుమీద తారల తళుకు
నా నొసటి మీద క్రొన్నెలవంక తులుకు"

అని తారల్నీ, చంద్రుణ్ణీ అందుకోడానికి చెయ్యిజాస్తాడు కాల్రిడ్జికి మల్లే. చివరికు ప్రేయసి తోడి అనుభవాన్ని వర్ణించేటప్పుడు గూడా

"నీ వొడిలో నా తల పెట్టుకొని
అభ్యంగనావిష్కృత త్వదీయ వినీల శిరోజ తమస్సముద్రాలు పొంగి
నీ భుజాలు దాటి, నా ముఖాన్ని కప్పి,
ఒక్కటే ఒక్క స్వప్నాన్ని కంటూన్న వేళ"
చంద్రికా స్నపిత సంగీతాన్ని వింటున్న వేళ"

అని శిరోజాల్ని సముద్రాలుగా ఊహించి, వెన్నెలలో కలిగిపోవడానికి యత్నిస్తాడు. ఈ విధంగా అతని అనుభూతి, కాలాన్నీ, ఆకాశాన్నీ, దిక్కుల్నీ, సముద్రాల్నీ, ఖగోళాల్నీ ఎప్పటికప్పుడు సాగదియ్యాలని ప్రయత్నిస్తుంది. తనకి "అనంతానికీ మధ్య వ్రాలిన వినీల తమాలశాఖ"ల మీద ఎక్కి అనంతాకాశాలకి ఎగిరిపోవాలని చూస్తుంది.

అతని అనుభూత్యావిష్కరణలో మరొక విచిత్రత్వం ఉన్నది. అది సనాతనత్వాన్ని తన అనంతత్వ భావనకి ఆలంబనగా స్వీకరించడం. సనాతన వస్తువు మీద

మానవుడికి ఒక అనంత భావనా స్ఫురణ ఉంటుంది. పాతరాతి యుగాలలోని మానవుణ్ణి భావిస్తేగాని, సృష్టి మొదటి జీవుణ్ని స్మరిస్తేగాని, ఇత్యాది సనాతన వస్తు భావనచేత, ప్రతి వ్యక్తికీ హృదయపు మూల ఒక అనంతతా స్పర్శ వికసిస్తుంది: వికసించడం కాదు, ఆత్మ లోతుల్లోకి సంకుచించుకుపోతుంది. ఈ అవకాశాన్ని అనేకచోట్ల ఉపయోగించుకుంటాడు తిలక్. దీనికి ఉన్నతదశలోని ఉదాహరణ "శిఖరారోహణ" లో ఉన్నది. ఈ గేయంలో తిలక్ నూతన సంవత్సరానికి స్వాగతం పలుకుతున్నాడు. కాని ఆ మిషతో, నవీనకాల దుర్లక్షణాన్ని, నవ్య యుగావశ్యక వ్యక్తి వికాస లక్షణాన్నీ ధ్వనిస్తాడు. గేయం యొక్క మొదటి మూడు భాగాల్లో, ఆధునిక కాలంలో ప్రాప్తించిన దౌర్భాగ్యాన్ని చమత్కార పూరితమైన తీక్ష్ణ ధ్వని రచనతో నిరూపించి, నాలుగో ఖండంలో కాలపు మూలల్లోకి, అనుభూతి లోతుల్లోకి కూరుకుపోతాడు. ఈ నాలుగో ఖండమంతా సనాతనత్వ భావపూర్వకమైన అనుభూతి వేదనాకవిత.

> "అప్పుడే నేను కాలతీరాన ఒక్కణ్ణీ నడుస్తున్నాను
> చరిత్ర విచిత్ర సముద్రాలవలోకిస్తూ...."

కాల తీరంలో నడుస్తూ, ఒడ్డున ఉన్న అనుభూతి యిసుకపాతర్లు తవ్వుతూ పూర్వ పూర్వానికి నడిచి నడిచి, ఈ విధంగా చెప్తాడు.

> "అప్పుడు ఈజిప్టు పిరమిడ్ల మధ్య
> బాబిలోనియా స్థూపాల మధ్య
> మొహంజొదారో శిథిలాల మధ్య
> నిలిచి కలలు కంటున్నారు....
> అలా అలా అనాది అనాది అంధకార భయంకరాటవుల మధ్య
> సృష్టి సింహం చేసిన ప్రథమ గర్జ విన్నాను"

సృష్ట్యాదికి పోయిన ఊహతో, అక్కడి ప్రథమ గర్జతో మనస్సుకి జలదరింత కలిగిస్తుంది ఈ సనాతనత్వ భావం. పిరమిడ్లు, స్థూపాలు, శిథిలాలు- కాలంలోని, ప్రాచీనత వలన మన మనస్సులో ఒక రహస్యపు చీకటి గోతిలో కదిలే విశిష్టానుభవ సంకేతాలు. వాటిని తన కవిత్వంలో చాలా చోట్ల ఉపయోగిస్తాడు తిలక్.

ఆధునిక కవితలో రాదగిన ఒక బ్రహ్మాండమైన పరిణామం అనుభూతి వాదమని తిలక్‌కి తెలుసు. ఒక ఉపన్యాసంలో ఆయన అయన అంటాడు.

"ఛందస్సూ కవి సమయాలూ మొదలైన సంకెళ్ళ నుండి తప్పుకొనిన కవిత ఎలాగ అచ్ఛమైన రూపం సవరించుకొంటున్నదో. అలాగే కథా సంవిధానం అనే అనవసరపు తొడుగునీ విప్పుకుని ప్రధాన అనుభూతుల ఆకృతితో దర్శనమిస్తోంది".

కవి దృష్టి నేడు ఒక లాంతరు పట్టుకుని నలుమూలలకూ వైపులకూ వెళ్ళి ఓపికగా పరిశీలించడం లాంటిది కాదు. వస్తు స్వరూపాలకూ సంఘర్షణలకూ శక్తులకూ మూలమైన కీలక స్థానం మీద శక్తివంతమైన బ్యాటరీ లైటు ఫోకస్ చెయ్యడం లాంటిది.

ఇట్లా తిలక్ యొక్క కవితాచరమ పరిణామం స్వచ్ఛమైన అనుభూతివాదం. గుండెలోని చీకటి కోణాలమీద అతని అనేక ఖండికలు మహా శక్తివంతమైన బ్యాటరీ దీపాలు.

---

"కాలం సవాల్ లాంటిది
సాహసవంతుడందుకుని ముందుకు సాగిపోతాడు"

—తిలక్.

"ఏదేశ సంస్కృతి అయినా ఎన్నడూ కాదొక స్థిరబిందువు
నైక నదీనదాలు అదృశ్యంగా సంగమించిన అనంతసింధువు"

—తిలక్.

"తెరచే కిటికీని బట్టి
పరతెంచే పుష్పపరాగం ఉంటుంది
గదికీ మదికీ కూడ గవాక్షాలుంటాయి"

—తిలక్.

రవిబాబు | # అమృతం త్రాగినవాడు

కిటికీ అవతల
"ఫెరన్ మొక్క, పికిలిపిట్టా
గిలగిల్లాడుతున్న శిశిరర్తు క్షీణ చంద్రరేఖ
సంధులలో దుమ్ము కొట్టుకుపోయిన పిల్లల కళ్లు
నూతన పవనాలూ
హిమస్నాత మాలతీ లత
గాజు గొట్టాల జాలరులు
కుండీలోని పూల మొక్కలు"
నీవు కిటికీ పక్క లేకపోవడం చూసి
దిగ్భ్రమ చెందుతున్నాయి.
ప్రపంచమంతా నీ కిటికీలోంచి - లోనికి చూస్తూ
నీ కోసం వెదుకుతోంది.
కిటికీ అవతలకి దిగంతాలకి వ్యాపించిన నీవు
బయట నుండి కిటికీలోపలికి సంకోచించుకుపోయి నీవు
కనుచాటై పోవడం
ఎలా భరించడం? ఎలా భరించగలం?

* *

యుద్ధాల్లో మరణించిన సైనిక వీరుల
తల్లులూ, భార్యలూ, అక్క చెల్లెండ్రూ

విలపిస్తున్నారు నీకోసం!
మానవత్వం కోసం!

హార్లెమ్‌స్క్వేర్‌లో జేమ్స్ పొవెల్ అంతరాత్మ
శామ్యూల్ ఎన్‌చెస్టర్ ఆత్మ
వాళ్ల తమ్ముళ్లూ, మేనల్లుళ్లూ, మానవులూ

విలపిస్తున్నారు నీ కోసం:
మానవత్వం కోసం:

'వెన్నెల్లో ఆడుకునే అందమైన ఆడ పిల్లలూ
పరిజాశక్తుల నావహించే విజయ ఐరావతాలూ
కన్నీటి జడులలో తడసిన దయాపారావతాలూ'

వంటి అక్షరాలు ఇక కనబడవేమోనని
విలపిస్తోంది ఆంధ్రి సాహిత్య మాత.

* *

ఇది నిజం
ఆనాడు నీవు
అందరూ నిద్రిపోతున్న రోజా
అమృతం కురిసిన రాత్రి
జాల్వారిన అమృతపు సోన
దోసిళ్లతో తాగి వచ్చావు
నీవు అమరుడివి.

---

"మానవత లేని లోకాన్ని స్తుతింపలేను, మానవునిగా శిరసెత్తుకు తిరుగలేను; ఈ నాగరకతారణ్యావాసం భరించలేను."

—తిలక్.

# కాంతి జలపాతం | అనుముల కృష్ణమూర్తి

ఆధునిక సామాన్యునికి అన్ని సమాజ రంగాల్లో ప్రతినిధులు ఉన్నారు. మధ్య యుగంలోవారికి పాపం ఒక్కరూ లేరు. సాహిత్య రంగంలో అతనికి అతి ఆప్తులైన ప్రతినిధులలో తిలక్ ఒకడు. సాహితీ రంగాన రచయితయైన ఆప్తుని సాము దాయిక కృషి పర్యవసానంగా ఉత్పన్నమయ్యే మేధావులకుండే జాగరూకత, రసానంద చైతన్యమూ, సామాన్యుని సత్వంలోకి ప్రవహింపజేస్తాడు తిలక్. ఇట్లాగే రాజకీయ రంగంలో, వ్యవసాయ రంగంలో, పారిశ్రామిక రంగంలో ఆధునిక సామాన్యుని ప్రతినిధులు అత్యంత దీక్షతో కృషి చేస్తున్నట్టున్నది. ఈ వివిధ క్షేత్రాల జరిగే సాము దాయిక కృషి భిక్షవల్ల ఆధునికుడు వైయక్తికంగా, ఆధునిక యుగం సామూహికంగా, నూత్న చైతన్య ప్రబుద్ధమవుతున్నది. ఈ రీతిగా ఆధునిక రచయిత, ఆధునిక చైతన్య మహాస్రవంతిలో తన రచనాధారని అంకితం చేస్తున్నాడు. వీరందరూ నీతి నిజాయితీలే కాక సామాన్యుని ఆశయాల్ని స్వధర్మాన్ని గుర్తించినవారు. ఆ సామాన్యునిగూర్చి వారిలో తనూ ఒకడుగా తిలక్-

"చావు పుట్టుకల మధ్య సందేహంలాంటి జీవితంలో
నలువైపులా అంధకారం
మంచి గంధంలాగ పరిమళించే మానవత్వం
మాకున్న ఒకే ఒక అలంకారం'' అంటాడు.

తనకుపాసనీయుడైన సామాన్యున్ని మధ్య యుగాల వ్యూడలిస్టు వాని అనుబంధ ఇస్టులూ, తన్మత సాహిత్య సంప్రదాయ సభ్యతలూ నేటికీ, అణగద్రొక్కా లనే యత్నంలో ఉన్నవి. కాబట్టి వారూ వారి అనుబంధులూ సామాన్యునికాప్తుడైన నేటి రచయితకు శత్రువులు. వాళ్ళను వెక్కిరిస్తూ తిలక్—

"మౌఢ్యంవల్ల బలాఢ్యులు, అవివేకంవల్ల అవినాశులు
వీళ్ళందరూ మధ్య తరగతి ప్రజలు
సంఘపు కట్టుబాట్లకి రక్షక భటులు
శ్రీమంతుల స్వేచ్ఛావర్తనకి నైతిక భాష్యకారులు
శిధిలాలయాలకు పూజారులు" అంటాడు.

తిలక్ యొక్క రచనా వ్యవసాయంలోని ఎక్కువ అంశ ఈ చిత్త వృత్తి తోనే సాగింది. కనుక అతనిపై అతని రచనపై ఆధునికులమైన మనకు ఇంత ఆసక్తి, ప్రేమా కలుగుతున్నది. తానాశించే ఈ జాగృతి సుదూరంగా ఉన్నప్పుడు కవి నిస్పృహా వశుడౌతున్నాడు. దీనినే 'గొంగళి పురుగు'లో విసిగెత్తి చివరకు గొంగళి పురుగు బల్ల పరుపుగా పరుచుకొన్న తన జీవితాన్ని పరుపు చుట్టలా చుట్టి ఆత్మహత్య చేసుకుందా మనుకుంటుంది. అంత డెస్పేర్ అయికూడా పెళ్ళాం మాట వినపడి, బాస్ కేక వినపడి భయంతో వణుకుతాడు. సగం సగం తిన్న కలల్ని నెమరేస్తూ సగం సగం చచ్చిన ప్రాణాన్ని జోకొడుతుంటాడు. అట్టి నిస్పృహాలోని రమణీయతనే తనకందని ప్రియు రాలుగా భావించి ప్రాధేయపడుతున్న సంగతి కవితా సృష్టినీ తదుపాధేయమైన లక్ష్యాన్నీ కావ్యాత్మతో విశ్లేషిస్తేనేగాని తెలియదు. ఈ నిస్పృహా రమణీ యతలోని సుందరీ సాక్షాత్కారాన్ని తిలక్

"ఏ నిశ్శబ్ద ప్రపంచాల మధ్య ఏవిటి నీ కళ్ళు మాట్లాడుతున్నాయి
ఉత్తర ధృవంలో మంచువంటి తెల్లని
హృదయం గలదానా ఆడదానా, ఎన్ని పూర్వజన్మల జాడలు
ఈ క్షణంలో నీ కనురెప్పల నీలినీడలు" అంటాడు.

నేటి కవి ఉన్మత్తుడుగాడు, కేవలావేశ పరతంత్రమైన రచనను చేయడు. ఆధునిక సామాన్యుని వైయక్తిక స్వాతంత్ర్యాన్ని నిర్వచిస్తూ తిలక్‌వలె తెనుగు, హిందీల్లోనే కాక ఆంగ్లంలో కూడా అనలేదనిపిస్తున్నది. ప్రార్థనలో-

కొంచెం పుణ్యం కించిత్ పాపం, కాస్త కన్నీరు
మరికాస్త సంతోషపు తేనీరు
పరదాగా నిజాయితీగా జాలి జాలిగా
హాయి హాయిగా బ్రతుకుతాం"

1963లో అతని 'మైనస్ ఇంటు ప్లస్' ప్రకటితమైంది. అప్పటి పరిస్థితులకు లోనై తిలక్‌లో, నిస్పృహత చెలరేగింది. ఆ నిస్పృహా ప్రతిబింబంగా "మానవుడు మానవుడుగా దేవుడుగా రూపొందే ఈ ప్రయాణం అనంత దీర్ఘము, పునః పునః వ్యర్థము, బహుయుగ విస్తీర్ణము" అంటాడు. అనంత దీర్ఘము బహుయుగ విస్తీర్ణము అయిన మానవతా సంఘర్షణ, కృషి ఎన్నటికైనా ఫలిస్తుందనే ఆశకు బదులు తిలక్

స్పష్టంగా ''పునః పునః వ్యర్థం'' అనే పెస్ మిస్టిక్‌గా కనిపిస్తాడు మనకు. అతని రచనా కౌశలానికి మచ్చుతునకగా ఈ ఒక్క ఖండికచాలు. దీనిలో ఆతని ఆత్మ అంగీకరించ లేని బలీయమైన తాత్కాలిక సత్యమేదో ఉన్నది. తత్ఫలితముగా "ఉన్న శాంతి" జడంగా కన్పించింది. స్టాటిక్‌గా లేక 'పాసివ్'గాకన్పించిందన్నమాట. నిష్క్రియత్వాన్ని శాంతిగా భ్రమ పడుతున్న మానవుడికి తిలక్ సంఘర్షించమని ఆదేశిస్తాడు....

''జడంగా ఉన్న శాంతి నుండీ ఎడంగా తప్పుకొంటాడు మానవుడు
సంచలనం కల్గించే సమరాంగణాన్నే కోరుకుంటాడు
యుద్ధాలు లేని చరిత్ర చదివితే అర్థవిహీనం"

ఇందులో మానవ హృదయానికి శాశ్వతంగా హత్తుకుపోయే సత్యాన్ని "అసలైన మనిషి కాస్తా అలజడిలో బైట పడుతాడు" అంటూ లౌక్యపు బండారాన్ని బయట పెడుతాడు. వయసెల్లా జనన మరణాలకు లోనౌతుందో కృషి కూడా అలాగే ఆశ నిరాశలకు లోనవుతుంది. దాని అంతిమ జయం పునః ప్రయత్నానికి పునః సంఘర్షణకీ పునాది మాత్రమేనని తాత్వికుడైన ప్రతి కవి సులభంగా గ్రహిస్తాడు. తానెల్లప్పుడూ "జ్వాలావలయితుడు దుఃఖితుడు" లోపలా బయట దుఃఖమే ఆవరించినవాడు. 'క్షత జగత్తు ఆక్రోశించిన కరుణా భీభత్సరవాలు' అనంతంగా స్వచ్ఛందమైన ఆశా వాహినికి అడ్డు తగులుతూనే ఉంటాయి. ఇంత ఆవేదనలోను తిలక్ తన అంతర్గత సంగీతం అనుపమ సుందర గీతం వింటూ జన్మలోని సాఫల్యం కోసం ఎడారి దారుల్లో సైతం ప్రయాణిస్తాడు. ఆ ప్రయాణం మొదలయినప్పటి ఆశలు పురిపోసుకున్న ఉత్సాహం. ఒక్కొక్క పోగే తెగిపోతూ అప్పుడు ఒక్కొక్క తీగ తెగుతూ మిగిలిన ఈ విచిత్ర విపంచికను మీటుకుంటూ ఆ ఎడారిలోనే ఆ కంటకిత కానన మార్గాలలోనే ఏ ఒక్క ప్రాణి కన్పించినా వాని ప్రతి గడప ముందు, ప్రతి గవాక్షం ముందు, నిలబడి పాడుతున్నాడు, పిలుస్తున్నాడు. ఆ కనిపించినవాని హృదయంలోని ప్రతి తెరనీ తొలగిస్తున్నాడు. ప్రతి అరనీ తెరుస్తున్నాడు. ఇక్కడ ఒక విచిత్రం ఉంది. ప్రతిభావ్యుత్పత్తులు గలకవి తను సామాన్యునితో ఎంత ఎమోషనల్‌గా అసోసియేట్ కాగలడో అంత ఇంటలెక్చువల్‌గా కాలేదన్నది అనుభవంలోనున్న వాస్తవికత. ందుకే "మీవాణ్ణి మీ అందరి మధ్యా బ్రతుకుతున్నవాణ్ణి" అంటూనే అయినా నిలువెత్తు తెర వెనుక నిల్చిన నేపథ్యగాయకుణ్ణి'అంటాడు తిలక్. ఈ ఒక్క ఎడమూ తనకూ తనకాత్మీయుడైన సామాన్యుడికీ మధ్య నిలువెత్తు తెరను నిలిపినా అతని కవిత ''దిగులు నీరు నిండిన కోటి మనస్సరస్తీరాల కోరికల కోణాకారపు కొత్త చెట్లను నాటుతున్నది.'' ''మానవతకెప్పుడైనా ఫలితం దక్కుతుంది నా గుండెలపై శుక్రతార కిరణం సూటిగా వచ్చి వాలుతుంది." తిలక్ తన రెండు దశాబ్దాల

రచనా తపస్సులో తన ఆరోగ్యాన్నీ తుదకు ప్రాణాల్ని కూడా కోల్పోయాడు. ఆత
డమరజీవి. అతడు లేడు. అతని పాట ఉంటుంది. ఈ సుదీర్ఘమైన తపస్సు లేక తపన
బహు మార్గముల సంతరించుకున్నది. కథానికల నుండి కవితా వ్యాసముల వరకు
స్కెచ్‌ల నుండి నాటకాల వరకు అతని కలం పరిణతిని సాధించింది. సంకేతాన్ని
(Symbol) తిలక్ వాడుకున్నంత అందంగా, అవిచ్ఛిన్నంగా సారస్వతంలో బాగా
చేతులు తిరిగిన మహామహులే వాడుకోలేకపోయినారంటే అతిశయోక్తి కాదు. అలాగే
కరుణని అంత మృదువుగా మనోహరంగా విస్తరింపజేసినవాళ్లూ అరుదే అనవచ్చును.
"నీడలు" అన్న కవితలో "చిన్నమ్మ" అని సంకేతం పెట్టి సంపత్తు (Penury) కి
విరుద్ధమైన దానిని తన సమకాలిక అధఃపతిత మానవుణ్ని కనికరించమంటాడు. వాళ్ల
నతడు వర్ణించిన విధానంలోని సొంపూ, మాటల సోయగమూ అనూహ్య రమణీయం.
వాళ్లు పాపం అవకాశం అందుకోలేని వాళ్ళు, అనుభవాల్నుంచి పారిపోయేవాళ్లు,
గతించిన కాలపు నీడలు— మధ్య తరగతి ప్రజలు". 'వీళ్లు
మౌఢ్యంవల్ల బలాఢ్యులు అవివేకంవల్ల అవినాశులు సంఘపు కట్టుబాట్లకి రక్షక భటులు
అంతేకాక శ్రీమంతుల స్వేచ్ఛావర్తనకి నైతిక భాష్యకారులు'. చిన్నమ్మ 'శ్రీ'యే కాని
పై శ్రీమంతులలోని శ్రీ కాదు. ఈ శ్రీ స్వేచ్ఛావర్తనని ప్రేరేపిస్తుంది. చిన్నమ్మలో
కరుణా వైలక్షణ్యమూ ఆత్మీయతా ఉన్నది. అందుకే కవి ఈ సూక్ష్మ వివేచనతో చిన్న
మ్మనే ప్రాధేయపడుతున్నాడు.

తిలక్ కవిత్వంలో ఒక్క సామాన్య లక్షణం కన్పిస్తుంది. అది అతని సాం
ప్రదాయ కవితా పరిచయ బాహుళ్యపు ప్రతిబింబమో అనిపిస్తుంది ఈ గుణమతడు ఏ
ఒక వ్యక్తినో, పరిసరాన్నో, సంఘటననో వివరించదల్చుకున్నప్పుడల్లా అతని ఊహ
ఆవేశంలోనికి వచ్చి రచనలో సాక్షాత్కరిస్తూంది. కానిఒకేఒకవిషయాన్నిపది పంక్తుల్లో
పది తీర్లుగా వర్ణిస్తే, ఆ విషయంలో కొత్తదనం పుట్టదు సరికదా పాఠకుడికది అత్యుక్తి
గా, పునరుక్తిగా భాసిస్తుంది. 'నీడల'నే కవితలో మధ్య తరగతి ప్రజలను దాదాపు 20
పంక్తుల్లో వర్ణిస్తాడు. దీనివల్ల మొత్తం రచనా పద్ధతిలోనే క్లుప్తత (Brevity) కాతడు
శ్రద్ధ ఇవ్వలేదేమో ననిపిస్తుంది.

అతని అన్ని రచనలు ఒక ఎత్తు. 'నవత-కవిత', 'అదృష్టాధ్వగమనం',
'మాగ్నాకార్టా' ఒకెత్తేమో ననిపిస్తుంది. ఈ ఖండికల్లో 'అదృష్టాధ్వగమనం' "ఎవరూ
వినని పాటని" 'ఎవరూ నడవనిబాటని' పాడుతూ నడుస్తోన్న తిలక్‌నీ, 'మాగ్నాకార్టా'
పాటపాటకి లేచి కెరటంలాగ మాటమాటకు మ్రోయు కిన్నెరలాగ ఉపాసకుడూ పిపా

సుప్తా అయిన తిలక్‌నీ సాక్షాత్కరింపజేస్తవి. మాగ్నాకార్టా 1945 లో అదృష్టాధ్వగమనం 1964 లో ప్రకటితాలు. 20 ఏళ్ల స్వతంత్ర భారతంలో తిలక్ హృదయాన్ని అంతగా కృంగచేసిన సంఘటనలెన్నో జరిగినవి. అయినా అతడు "ఆకాశానికీ భూమికీ మధ్యపడిన చిరు చీకటి పలకమీద రేడియం అక్షరాల్ని వ్రాసుకుంటూ". "శిశిర వసంతాల మధ్య వచ్చే విచిత్ర మధురమైన మార్పుని" గుర్తుకు తెచ్చుకుంటూనే ఉన్నాడు.

అసంఖ్యాకాలైన కవిత్వ నిర్వచనాలన్నీ తిలక్ 'కవిత్వమొక ఆల్కెమీ వంటిదని దాని రహస్యం కవికే తెల్సున'ని అన్న నిర్వచనమే. పూర్వాధునికాలే కాక భవిష్యత్కాలానికీ చెల్లుతుందన్నట్లుగా అతని నిర్వచనమే తుది మాటగా భాసిస్తుంది. కాని కవిత్వ రహస్యం తనకు నచ్చిన నలుగురికే తెలుసునన్నాడు తిలక్. ఇలా ఎందుకన్నాడో అతని సన్నిహితులైనవారికి బహుశా తెలిసే ఉంటుంది. అది వారు వివరించాలి. ఈ ఖండికలోనే అతడిచ్చిన మరువరాని సందేశం మరోటుంది ఆధునిక కవిత్వానికి. "కొత్తగా గమ్మత్తుగా ఉంటుందిగాని ఇది నాన్సెన్సు. ఇది పసితనం ప్లస్ వెఱ్ఱితనం". అంతేకాదు పీటికి డకడెన్స్‌తో హెచ్చవేశాడు తిలక్. ఇంత కచ్చితంగా ఒక్క తిలక్ తప్ప మరెవ్వడూ అనలేక పోవడం శోచనీయం. బ్రతికున్న తిలక్‌తో గొంతు కలపలేకపోయినవాళ్లు కనీసం కన్ను మూసిన తిలక్‌తోనైనా తిలక్ వాణితోనైనా గొంతు కలిపితే ఆధునిక కవిత్వానికి వస్తున్న అపప్రథని, అపచారాన్ని తొలగించిన వారవుతారు.

వాచ్యం కాకూడదనీ, వ్యంగ్యంగా ఉండాలనీ, ధ్వనివ్యంజనాదులే కవిత్వ బీజ క్షేత్రాలనీ పూర్వంనుండీ ప్రచారంలో ఉన్న సూత్రాలే. వాటికంటే ఒక మెట్టు ముందుకేసి తిలక్ abscurity ఉండవచ్చునంటూనే దాన్ని Transperent చీకటంటూ వివరిస్తాడు. ఈ Transperent చీకటికి మచ్చుతునక 'నవత-కవిత'లోని "కాళిదాసుకి తెలుసు-కి పెద్దన్న తెలుసు, కృష్ణశాస్త్రికి తెలుసు- శ్రీశ్రీకి తెలుసు." అన్న పంక్తి. కవిత్వపు పరమావధి అందం ఆనందం అన్నది Trarsperent చీకటే. అందం పరమావధికాదు. ఆనందం మాత్రమే పరమావధి. కాని అందంలేనిదే ఆనందంలేదు. ఈ రెంటి అవినాభావ సంబంధమే కవిత్వానికి పరమావధి యన్నది తిలక్ నిశ్చితాభిప్రాయము.

ఏ కవియొక్క సుదీర్ఘమైన వాఙ్మయ తపస్సూ ఒకే ఒక లక్ష్యాన్ని గురించి ఉండడం అసంభవం కాబట్టి అతని ఊహాకోణమిదియనిగాని. 'ఇజ'మిది అనిగాని

ముడిపెట్టడం దాదాపు పెట్టి. ఈ పెట్టిలోనే ఆధునికులయిన పాఠకులూ, విమర్శకులూ ఒక కవిని ఛాందసుడనడం, ఒక కవిని కమ్యూనిష్టనడం, ఒక రచయితని పౌరాణికుడనడం, ఒక కథకుణ్ణి లైంగికుడనడం జరుగుతున్నది. రచనలకూ, రచయితలకూ గల కొలబద్దలు ప్రసిద్ధమయినవి వేరే ఉన్నప్పుడు ఈ సంకుచితమైన దృక్కోణంతో తులనాత్మక పరిశీలనం జరపడము అసాధ్యము. ఇందులో ఒక రచయిత ఏదో ఒక విధముగా Brand ఐపోయే అవకాశం ఉన్నది. ఆ నిందాభీతిచేత రచయిత కూడా తన స్వాతంత్ర్యాన్ని పోగొట్టకునే ప్రమాదమూ ఉన్నది. అందుకే ఉభయత్రా అనర్థక హేతువైన ఈ మానదండమే పనికిరాదు. తిలక్ "నా కవిత్వం కాదొకతత్వం, మరి కాదు మీరనే మనస్తత్వం, కాదు ధనికవాదం సామ్యవాదం, కాదయ్యా అయోమయం జరామయం" అంటూ విమర్శకుల్ని ఆ కొలత బద్దలతో కొలవవద్దన్నాడు. తన కవితా శక్తినంతా కరుణా శృంగారాల్లోన్నే నింపి విశ్వశ్రేయస్కరం చేస్తానంటాడు. కరుణానికి దయా పారావతాలను, శృంగారానికి అందమైన ఆడపిల్లలను, విశ్వశ్రేయస్సుకి విజయ ఐరావతాన్ని సంకేతాలుగా అందిస్తాడు. అందుకే ఆతడాధునిక సామాన్యునికే ఆత్మీయుడైన ప్రతినిధి. ఆతని కవిత కరుణా ప్రధానమైనది. ఆతని మాటల్లోనే చెప్పాలంటే "కరుణలేని కవివాక్కు సంకుచితమౌతుంది." తిలక్ కవిత అచ్చమైన కరుణాకాంతి జలపాతం.

---

"పులి చంపిన లేడి నెత్తురు పులుముకోలేను  
ఖడ్గమృగోదగ్ర విరావం ఆలకించలేను  
జగద్ధాత్రీ! నీ కుమారులమైన మేము  
తత్త్వాల పేర విప్లవాల పేర  
ఒకరినొకరం హతమార్చుకోలేము"

— తిలక్.

'కరుణ లేని కవి వాక్కు సంకుచితమౌతుంది'

— తిలక్.

# దేవుడు గొప్పవాడు!

'గిరీశం'

అది కాదు బ్రదర్!

ఎవడు మాత్రమెంత కాలమని ఊరుకుంటాడు చెప్పు!
పిల్లనీ, నల్లనీ గదిలో బంధిస్తే రాకుండా ఉంటుందా ముప్పు
యముడో, గిముడో ఎవడైతేనేం, వాడూ ఓ దేవుడే కదా!

అతని

చేతగాని తనాన్ని, చేవలేని మాన్యాన్ని విమర్శించినా కిమ్మనలేదు
సానుభూతి జల్లు కురిపిస్తూ వీధి చివరిదాకా సాగనంపినా మారుపలకలేదు
ఎంతైనా పెద్దవాడుకదా, కన్న కొడుకుచేతనే అంత మాటా!
"అనంత విశ్వంలో మూర్ఖుడు, ఏ కోణం నుండి చూసినా మిజరబుల్ ఫెయిల్యూర్"
అని రీసెర్చి చేయించి, ప్రిస్టేజి తీయించి, ఎపిటాఫ్ రాయిస్తే
ఎంతటి జడుడైనా, షండుడైనా, పాషండుడైనా Wound అవడూ?
అసూయలకూ, అనుమానాలకూ, Almighty అతీతుడేం కాదు
పంతాలకు, ప్రతీకారాలకు కోపతాపాలకు మొనగాడు మనగాడ్
ప్రతిసారీ నీవు 'గోల్' చేస్తున్నావని, Sportsmanship కోల్పోయిన లార్డ్
రూల్స్ గొలుసును తెంపి హార్ట్‌పై ఎటాకా? Shame! ఐ పిటీ ది మూడ్

అసలు

నాకెందుకో మొదట్నుంచీ కొంచెం భయం భయంగానే వుంది
పది మందికందని పథాన సాగిపోతుంటావు—పగ ఉండదా అని
అందాల నడకలతో, పొందికైన మాటలతో, పసందైన ఊసులతో, ఊహాలతో
సొంపులతో సోయగాలతో మంత్రించే, మత్తెక్కించే నీ కవితా సుధ
మా పెదాలను పూర్తిగా తడిపి, సేచురేట్ చేసి, ఆనందపు నందనాల సృష్టించే
ఆ రోజులింకా రావు - యిపుడు నువ్వు లేవు - నీ పాట వుంది

బల్ల పరుపుగా పరచుకున్న జీవితంపైన సగం తిన్న కలల్ని నెమరేస్తూ
'గొంగళీ పురుగు' కోటేశ్వర్రావు, వీరేశ్వర్రావు నా కళ్లలో ఆడుతున్నారు
'గుండె క్రింది నవ్వు' సైనికుల ఉత్తరాల పాత జ్ఞాపకాల రంపపు కోత
'నగరంపై ప్రేమ గీత'పు నిషా, నరనరాన్నీ, అణువణువునూ కూల్చివేస్తున్నది,
కాల్చివేస్తున్నది
కాలంతో సవాల్ చేసి సాగలేక చతికిలబడిపోయిన పెద్దన్నయ్య, మొద్దన్నయ్య
పళ్లికిలించి పరిహసిస్తున్నాడు - ముళ్ళ చూపులతో నన్ను కలచివేస్తున్నాడు
'కాస్మాపాలిటన్ బోర్' సడీ సవ్వడీ లేకుండా గోరీ బయటికొచ్చేసి, అటూ ఇటూ చూసి
ఎపిటాఫ్‌లో దేవుడి మాటను మాయంచేసి, సగర్వంగా లోనికి జారుకున్నాడు
ఇంతకూ, దేవుని నమ్మిన మనిషా, మనిషిని నమ్మిన దేవుడా,

ఎవడు వంచితుడు?

---

"జీవితం దేవతల దరస్మితం
చిన్నారీ! పెదవిమీద సింగారించు"

— తిలక్

'కవిత్వం ఒక Alchemy, దాని రహస్యం కవికే తెలుసును'

— తిలక్

"కవిత్వం అంతరాంతర జ్యోతిస్సీమల్ని బహిర్గతం చెయ్యాలి,
విస్తరించాలి చైతన్య పరిధి-
అగ్ని జల్లినా, అమృతం కురిసినా
అందం ఆనందం దాని పరమావధి"

— తిలక్

# శిఖరారోహణ

వరవరరావు

తిలక్‌కూ నాకూ పరిచయమయ్యి ఇంకా నిండా నాలుగేండ్లు కాలేదు. కాని ఈ నాలుగేండ్ల కాలంలో మా స్నేహం ఎంత ప్రగాఢమయిందంటే, ఆయన కూతురు వివాహానికి రమ్మని ఏప్రిల్ నెలలో ఆహ్వానిస్తూ 'కవి మిత్రులు కొందరు వస్తున్నారు. వారిలో నువ్వు లేకపోతే నాకు వెలితిగా వుంటుంది కాబట్టి తప్పక తప్పక రావాలిసుమా' అని రాసారు. ఆయన నన్ను ఆప్యాయంగా తమ్ముడూ అని పలకరించేవారు.

ఆయన పుస్తకం త్వరలో రావాలని, ఆయన ఫ్రీవర్స్‌ను ఒక ఉద్యమంగా భావించి అందులో నాయకత్వం వహించాలని, కవిత్వాన్ని ఒక వయ్యక్తిక స్వప్నంగా కాక ఒక సమష్టి చైతన్యంగా భావించాలని, అద్భుతమయిన శక్తి, ప్రతిభ వుండికూడ, విప్లవం ఒక పాలు లేక ఆయన రావలసినంత వెలుగులోకి రాలేకపోతున్నాడని రాసే వాణ్ణి ఆయనకు. కాల్పనికోద్యమంలో ఒక కాలు, అభ్యుదయోద్యమంలో ఒక కాలు కాకుండా పూర్తిగా అభ్యుదయ ఉద్యమంలో, అందులోనూ ఆధునికమయిన ఫ్రీవర్స్ మార్గంలో జడిలా దూకమని రాసేవాణ్ణి. ముఖ్యంగా 'భారతి'లోనో, మరే పత్రికలోనో ఆయన రచన వచ్చినప్పుడల్లా దానిమీద నా అభిప్రాయం రాసేవాణ్ణి ఆయనకు. ఆయన కూడా అట్లాగే తన రచన ఏ పత్రికలోనయినా అచ్చవగానే నా అభిప్రాయం తెలుప మని రాసేవాడు. ఒక్కసారి బాగా జ్ఞాపకం. వివేకానంద జయంతి సందర్భంగా 'భారతి'లో వివేకానందునిమీద పద్యాలు రాసాడు. నాకు ఆయనమీద ఏదో, హక్కు, అధికారం వున్నట్లుగా పద్యాలు ఎందుకు రాసారు? అని విరుచుక పడ్డాను. ఆయనదగ్గర నాకంత చనువు. ఆయన నవ్వి ఊరుకున్నాడు. 'నాకంత భేషజాలు లేవు. నాకు అను భూతి ప్రధానం. ఎట్లా లోపల్నించి పలికితే అట్లా రాస్తాను' అనేవాడు ఆయన. 'అక్కడే మీరు లీడ్ తీసుకోలేకపోతున్నారు. మీదైన ఒక మార్గాన్ని ఎంచుకోవాలి. ఆ మార్గంలో మీరు ఆధునికులకు ఆదర్శంకావాలి. ఆధునిక దృక్పథంలోకాదు, Formలో కూడ' అని నా వాదం. అట్లా అని తిలక్ ఫ్రీవర్స్ యాదృచ్ఛికంగా రాసాడని కాదు. 'లోపల వున్న ప్రేరణ వచన కవిత్వం రాయిస్తుంది' అన్నంత అభినివేశం ఆయన కందులో. 'పద్యం ఈనాటి అనుభూతి విలక్షణతను ప్రదర్శించలేదు. సమకాలీన జీవితం

లోని వివిధ ప్రవృత్తులు పద్యంలో చూపించలేం' అని శ్రీ జాసాని సుదర్శన రెడ్డి గారికిచ్చిన ఇంటర్వ్యూలో చెప్పారాయన.

ఫ్రీవర్స్ ఒక కవితా పరిణామంగా, ఒక అభివృద్ధి దశగా భావించారాయన. ఆయన 64 సెప్టెంబరు 'నవత' మూడవ సంచికలో రాసిన మాటలు చూస్తే ఈ విషయం తెలుస్తుంది. 'కవిత యొక్క నిర్వచనమూ తత్త్వమూ స్వరూపమూ ఎప్పటికప్పుడు మారుతోంది. విస్తృతమౌతోంది. గంభీరమౌతుంది. ఛందస్సూ కవి సమయాలూ మొదలైన సంకెళ్ళ నుండి తప్పుకొనిన కవిత అచ్చమైన రూపం సవరించుకుంటున్నద'ని నమ్మినవారాయన. శ్రీ కుందుర్తిగారు ఫ్రీవర్స్‌లో కథాకావ్యాలు రావాలని అభిప్రాయపడితే, రాస్తూ శ్రీ తిలక్ ఈ మాటలు రాసారు. అలాగే 'కథా సంవిధానం' అనే అనవసరపు తొడుగునీ విప్పుకొని ప్రధాన అనుభూతుల ఆకృతితో నేటి కవిత్వం దర్శనమిస్తోంది.' అందులోనే తిలక్ మనస్తత్వాన్ని పట్టి ఇచ్చే మాటలు కూడ వున్నాయి. కనుక ఉటంకిస్తాను. 'కవిత్వాన్ని నేడు అనుభవ ప్రధానంగా తీసుకుంటున్నాం' సిద్ధాంతాలకోసం కవిత్వాన్ని, అసలు వ్యక్తిని బలిపెట్టని తత్త్వమాయనది. కథాకావ్యం ఒకటి వస్తే తాను సంతోషిస్తానని అది వచన పద్య పద్ధతి యొక్క సామర్థ్యాన్ని నిరూపిస్తుందని, అదీకాక 'సాహిత్య రంగంలో విధి నిషేధాలు చెల్లవ'ని తేల్చివేసారాయన. ఈ ఆఖరు మాటే చాలు మీరు పద్యాలు రాయొద్దనే నా షికాయత్‌కి జవాబు.

1964 అక్టోబరులో వరంగలులో 'మిత్ర మండలి' ఆరవ వార్షికోత్సవాలు జరిపాము. ఆ సందర్భంగా స్వాతంత్ర్యానంతర కవిత్వం గురించీ, వచనం గురించీ వేరువేరుగా రెండు చర్చాగోష్ఠులు ఏర్పాటు చేసాం. ఆ సభలకు శ్రీయుతులు తిలక్, కుందుర్తి, సోమసుందర్, మహీధర్ రామమోహన్‌రావు, లింగరాజు, సంపత్ ఇత్యాదులను ఆహ్వానించాం. శ్రీ తిలక్ అనారోగ్యంగా వున్నానని, రాలేనని రాసాడు. ఆయన ఎట్లా వున్నా సరే వచ్చితీరాలి అని పట్టుబట్టాను నేను. 'నీ ఆహ్వానం ఆజ్ఞ వంటిది. అనుల్లంఘనీయం. తప్పకుండా వస్తాను' అని రాసారాయన. ఆ స్థితిలో ఒక్కరు రాలేక ఆయన సతీమణిని కూడ తీసుకవచ్చారు. మూడు రోజులు హన్మకొండలో మాతోపాటు గడిపారు. అప్పుడే మొదటిసారిగా ఆయనకు శ్రీ కాళోజీతో ప్రత్యక్ష పరిచయం. కాని కలిసిన మరుక్షణంలోనే శ్రీ కాళోజీ ఆయనకు 'కాళన్న' అయిపోయాడు. ఇంక శ్రీ తిలక్ కాళోజీకి ఏమయ్యాడో చెప్పాల్సిన పనే లేదు. శ్రీ తిలక్ కూతురు పెళ్ళికి ఆంధ్ర దేశంలో వెళ్ళిన ఒకే ఒక్క కవిబంధువు శ్రీ కాళోజీ. శ్రీ తిలక్ ఆయనకు 'కూర్చిన తమ్ముడు.'

స్వాతంత్ర్యానంతర కవిత్వం గురించి 'మిత్ర మండలి' నిర్వహించిన చర్చలోనూ మళ్ళీ శ్రీ కుందుర్తిగారు ఫ్రీవర్స్ ఒక పరిణామంగా, ఒక ఉద్యమంగా స్థిరపడాలంటే కథాకావ్యాలు రావాలన్నారు. శ్రీ తిలక్ కవిత్వానికి అనుభూతి ప్రధాన మని, నిసర్గమయిన కవిత్వానికి ఛందస్సు ప్రతిబంధకమయినట్లే కథకూడ ప్రతిబంధ కం కాగూడదని, ఫ్రీవర్స్ కవిత్వంలో ఒక పరిణామదశగా వచ్చింది కాబట్టి ఇంక అది నిలువదేమో అనుకోవడం అనవసరమని అన్నారు. ఈ మాటలే తర్వాత ఆయన 'నవత'లో రాసిన వ్యాసంలో మరింత నిర్దిష్ట రూపంలో వెలువడ్డాయి. "ఈనాటి కవిత చురుకైన ఆవేశాన్నీ సాంద్రతరమైన అనుభూతి ఒత్తిడినీ సూక్ష్మమైన భావననీ అనువ దించడానికి తన స్థానాన్ని ప్రత్యేకించుకుంది. అందువలననే దేశ దేశాల నవ్య కవితా విలసనంలో కథాభాగం వెనక్కి వెళ్ళిపోయింది. కవిత తన పరిధిని స్పష్టంగా నిర్ణయిం చుకోగలుగుతుంది." అని రాస్తూ "కవి దృష్టి నేడు ఒక లాంతరు పట్టుకొని నలు మూలలకూ వైపులకూ వెళ్ళి ఓపికగా పరిశీలించడంలాంటిది కాదు. వస్తు స్వరూపా లకూ, సంఘర్షణలకూ, శక్తులకూ కీలకస్థానం మీద శక్తివంతమైన బ్యాటరీ లైట్ ఫోకస్ చెయ్యడంలాంటిది" అని రాసారాయన. అందుకే తిలక్ స్వీకరించే కవితా వస్తు వులు తక్కిన ఆధునిక కవుల వస్తువులకన్నా భిన్నంగా, విలక్షణంగా వుంటాయి. ఆయన కీలకస్థానం మీద శక్తివంతమయిన బ్యాటరీ లైట్ ఫోకస్ చేస్తాడు. వస్తువుల మీద కాదు.

'మిత్ర మండలి' నిర్వహించిన కవి సమ్మేళనంలో అప్పటికింకా అముద్రి తమైన ఆయన రచనలు కొన్ని చదివాడు. అందులో నన్ను బాగా ఆకర్షించింది. 'నిన్న రాత్రి' అనే కవిత. (అదే నెల 'భారతి'లో తర్వాత అచ్చయింది.) ఒక విధంగా నా కందులో శ్రీ తిలక్ కవిత్వ తత్త్వమంతా ఇమిడి వున్నట్లుగా తోచింది అంతే కాదు ఆయనకూ తక్కిన అభ్యుదయ కవులకూ వున్న భేదంకూడా కనిపించింది. చాలామంది అతి నవీనులమనుకునే వారు తిలక్ ఎక్కడ ప్రాచీనుడని పొరపాటు పడుతున్నారో సంప్రదాయ సాహిత్యకులమనుకునేవారు ఎక్కడ తిలక్ తమ వర్గంలోని వాడని భ్రమ పడుతున్నారో కూడా నాకందులో అవగాహన అయింది. ఆ కవితలో ఒక యువకుని ఆకలి చావు, మానాన్ని అమ్ముకొని ఉరి పోసుకున్న సానిదాని గాథ ఇలాంటి అభ్యు దయ కవితా వస్తువులన్నీ వున్నాయి. 'కాంగోలో క్యూబాలో, లావోస్‌లో, సైప్రస్‌లో కాలి కమురుకంపు కొట్టే కాలం కథ మానవ వ్యథ' వుంది అందులో. అయితే మరి తేడా ఎక్కడ అంటే- ఇవన్నీ నేను నా మంచంమీద వచ్చి కూర్చొన్న దేవుణ్ణి అడుగ లేదు- అంటూ చెప్పడంలో వున్నది. ఆయన ఊరక అల్లరి చేయడు. ఆయన స్వభా వంలో లేదది. ఆయనకు 'గొలుసులోని అసలు కిటుకు తెలుసు'. అయితే ఈ సమాజ

మిట్టా కాలి కమురుకంపు కొడుతుంటే ముక్కు మూసుకొని కూర్చోనూలేడు. దేవుడు ఎంత అసహాయుడై పోయాడో ఈ ఆధునిక యుగంలో! దేవుని చెక్కిళ్ళమీద దీనంగా జారే కన్నీటిని తుడిచి ఊరడించాల్సిన స్థితి కవికి పట్టింది. ఆయన కుహనా కర్మ సిద్ధాంతులవలె ఆ బాధ్యతంతా దేవుని మీద వేయలేదు. పెద్దవాడు, కన్న కడుపు- మానవుడే దానవుడై ప్రవర్తిస్తుంటే దేవుడు మాత్రం ఏం చేస్తాడు అని, ఈ పనులన్నింటికీ మూలం మానవ స్వభావమని తేల్చివేస్తాడు. ఇక్కడే ఆయన ఏ సిద్ధాంతానికీ అతీతమయిన మానవతా ధర్మాన్ని ప్రతిపాదించేది. ఆయనకు నిఖిల సృష్టిలోని ఖిలం గూర్చి తెలుసు. నీరవ సుందర హృదయపాత్ర హాలాహలంతో నిండిందని తెలుసు. ఆ బాధ్యత మానవునిది. అంటే తనదని తనకు తెలుసు. ఆయనకు కవిత్వం గురించి, కవిత్వంలో నవత్వం గురించి చాల నిర్దిష్టమైన అభిప్రాయాలున్నాయి. కేవలం అనుభూతి విశేషాన్నే కవిత్వంగా భావించినవాడయితే ఆధునికుల్లో, ఫ్రీవర్స్ రచయితల్లో ఆయనకు అగ్రస్థానం వచ్చేదికాదు. మంచి కవుల జాబితాలో మాత్రమే చేరేవాడు. ఆయన కవిత్వంలో Obscurity, అస్పష్టత పనికి రాదన్నాడు. మోడరన్‌గా ఉందామని, ఏదో అందామనీ, తనకే తెలియని అస్పష్టపు అనుభూతిని అర్థంలేని యిమేజరీలతో, కలగా పులగపు వర్ణనలతో, చాతకాని అనుకరణలతో రాయొద్దన్నాడు. ఫ్రీవర్స్ రచయితల్లో తన అనుభూతి ఆకారం పాఠకుడికి అందేలా, హత్తుకునేలా రాసినవాళ్ళు ఒకరిద్దరికన్నా ఎక్కువ లేరు. అందులో ఆద్యుడు తిలక్.

'కవిత కొత్త అనుభవాల కాంతిపేటికను తెరవాలి, కదలించాలి. ఈ కాలంలో బ్రతుకు; యీ ప్రపంచాన్ని ప్రతిఫలించు. ఇంటికున్న కిటికీలన్నీ తెరచి అన్ని పవనాల్నీ ఆహ్వానించు. నువ్వు చెప్పేదేదైనా నీదై వుండాలి. నీలోంచి రావాలి. చించుకుని రావాలి. మళ్ళీ యీనాడు చిత్ర కవితల్నీ అవ్యామయ బంధాల్నీ పునరుద్ధరించకు'. అంటాడాయన.

ఇంతకన్నా ఆధునిక కవిత్వ దృక్పథం ఎలా వుంటుది? అయితే తిలక్‌లో విశేషం ఏమిటంటే ఆయన ఈనాటి వారిలో చాల మందివలె 'నిగ్రహ పరిగ్రహాలు లేని భావాశ్వాల్ని బరిమీద వదల'డు.

'కవిత అంతరాంతర జ్యోతిస్సీమల్ని బహిర్గతం చెయ్యాలి, విస్తరించాలి చైతన్య పరిధి. అగ్ని జల్లినా అమృతం కురిసినా అందం ఆనందం దాని పరమావధి.' ఇదీ ఒక్క మాటలో తిలక్‌కి కవిత్వం గురించి వున్న విశాలమైన అభిప్రాయం. అన్ని సిద్ధాంతాలకూ, అన్ని యిజాలకూ అతీతంగా ఇట్లా కవిత అంతరాంతర జ్యోతిస్సీమల్ని

బహిర్గతం చేసి చైతన్య పరిధిని విస్తరించే సమయంలోనే ఆయన అస్తమించడం ఒక విధంగా శిఖరారోహణకి చేసే ప్రయత్నంలో పట్టు తప్పిపోవడంవంటి ప్రమాదం.

'దిగంబర కవులు' పుస్తకం వచ్చినపుడు నాకు ఉత్తరం రాస్తూ 'ఇది ఏదో పాశ్చాత్య ఉద్యమాలకు అనుకరణ. ఇందులో ఎక్కువగా రిపిటేషన్స్ వున్న మాట కూడ నిజమే. అయినా వీరిలో మంచి ఆవేశం. ఉత్సాహం వున్నాయి. అన్నిటినీ మించి ఏ ఉద్యమం వచ్చినా మనం హృదయపూర్వకంగా ఆహ్వానించాల్సిందే.' అని రాసాడు. అంటే తిలక్‌కి ఏదీ చేయకుండా వుండే నిస్తబ్దతకన్నా ఏదో ఒకటి చేసిచూపే క్రియా శీలత్వం, ఉద్యమ స్వభావం కావాలన్నమాట. అంతకన్నా జీవశక్తికి, చైతన్యానికి, కవితా లక్ష్యానికి నిదర్శనమేముంటుంది?

తిలక్‌కీ తక్కిన ఆధునిక కవులకీ భేదం ఎక్కడ అంటే ఆయనలో క్షమా గుణం ఎక్కువ. ఆధునిక సమాజంలో వున్న లోపాలన్నీ ఆయనకు తెలుసు. అందరి కన్నా ఎక్కువే తెలుసు. ఈ సమాజం బాగుపడాలనే ఆకాంక్ష కూడ ఆయనలో తక్కువేమీ కాదు. అయితే ఆయన తాను కూడ ఈ సమాజంలో ఒకడు కనుక, ఈ అసహాయతకు ఈ స్తబ్దతకు, ఈ మనుషులే పూర్తిగా బాధ్యులు కారని క్షమిస్తాడు వాళ్ళను. అందులో తన బాధ్యత అంటే మేధావుల, కళాకారుల, విజ్ఞుల బాధ్యత కూడ వున్నదని ఆయనకు తెలుసు. 'నవత' ప్రథమ సంచికలో వచ్చిన ఆయన 'సీడలు' అనే కవిత చదివితే ఈ భావం చాల స్పష్టమవుతుంది. 'వీళ్ళమీద కోపగించకు, వీళ్ళనసహ్యించుకోకు, వీళ్ళందరూ చిన్నవాళ్ళు. ఆలోచనలు చిన్నవి. మనస్సులు చిన్నవి. ఆదరణలు చిన్నవి. అవకాశాలు అందుకోలేనివాళ్ళు. అనుభవాల్నుంచి పారిపోయేవాళ్ళు.' ఇట్లా చెప్తూ, చెప్తూ 'అయినా వాళ్ళను విడిచి వెళ్ళిపోకు, వీళ్ళందరూ నీ బిడ్డలు' అంటాడు. 'వీళ్ళ మధ్య డైనమైట్ పేలాలని, డైనమోలు తిరగాలని ఆకాంక్షిస్తాడు. ఈ సమాజంలో ఒక నిశ్శబ్ద విప్లవాన్ని ఆహ్వానిస్తున్నాడాయన. 'రేపటి ఉదయానికి యీ వేళ వెలుగుల్ని సమకూర్చుకోవాలి.' 'చీకటి పడుతోంది. చిటారు కొమ్మలో నక్షత్రం చిక్కుకుంది. శిథిల సంధ్యాగగనం రుధిరాన్ని కక్కుకుంది. దారంతా గోతులు. యిల్లేమో దూరం. చేతిలో దీపం లేదు. ధైర్యమే ఒక కవచంగా సాగిపోతానంటాడు. 'కాళరాత్రి వేళ కంకాళాలు చెప్పిన రహస్యం తెలియాలి. దారి పక్క నిల్చిన మోడు చెట్లు బాధ అనువదించాలి. పచ్చికలో దాక్కున్న పాముల్ని బుట్టలోకి పట్టాలి. అప్పుడుగాని రేపటి ఉదయానికి యీ వేళ వెలుగుల్ని సమకూర్చుకోవడం సాధ్యంకాదు. అయితే ఆ ప్రయత్నం లేకుండా 'ఈ భయస్తుల్ని' ఈ 'అమాయక సంప్రదాయకుల్ని', ఈ 'గతంలో కూరుకుపోయిన మనుషుల్ని', ఈ 'శిథిలాలయ పూజారుల్ని' వూరికే అసహ్యించుకొని లాభం

లేదంటాడు. 'వీళ్ళ మనశ్శిఖరాగ్రాలమీద ప్రశ్నా సూర్యుడుదయించి', 'హృదయ మైదానాలమీద స్వతంత్ర సైంధవం పరుగులెత్తా'లంటే వీళ్ళ మధ్య డైనమైట్ పేలాలి.

తిలక్‌లో వున్నంతగా 'ధ్వని' (Suggestion) ఆధునికుల్లో ఎవ్వరిలోనూ లేదు. ఈ లక్షణమే ఆయనను ఉత్తమోత్తమ కవుల శ్రేణుల్లో చేరుస్తున్నది. పైన ఉద హరించిన 'నీడలు' అనే కవితలోనే ఎంత లోతుగా పరిశీలిస్తే దానికంత విశాలమైన పరివ్యాప్తి వున్నట్లు కనిపిస్తుంది. పైకి స్థూలంగా చూస్తే అదేదో ప్రత్యేకమయిన సంఘ టనకు, స్థలానికి చెందిన కవితవలె 'చిన్నమ్మా! వీళ్ళమీద కోపగించకు' అని ఆరంభ మవుతుంది. కాని పైన ఉదహరించిన 'చీకటి పడుతోంది.... ధైర్యమే కవచంగా సాగి పోవాలి' అనే మాటల్లో ఎంత Suggestion వుంది! ఈ గేయమంతా ఇలాంటి 'ధ్వని' తోనే వుంది. ఆ 'నీడలు' అనే పేరులోనే ఎంతో సజెషన్ వుంది. 'వీళ్ళందరూ భయ పడిపోయిన మనుష్యులు. రేపటిని గురించినభయం' సంఘ భయం, అజ్ఞాతంగా తమలో దాగిన తమను చూసి భయం, గత కాలపు నీడలు వీరు' అంటాడు. ఆయన ఏ కవితను తీసుకున్నా ఈ 'ధ్వని' ఎంత ఊహకి, ఎంత ఆలోచనకి ప్రేరణ, తావు ఇవ్వాలో అంత ఇస్తుంది. అది పాఠకుని అనుభూతి, ఆలోచన, పరిశీలనా శక్తులమీద ఆధారపడి వుంటుంది. ఇటీవలినయిన 'శిఖరారోహణ' అనే కవిత ఈ లక్షణంలో శిఖరాలందు కున్నది. అసలాయన కవిత్వంలోని 'ధ్వని' (Suggestion) గూర్చి ప్రత్యేకంగా ఒక వ్యాసం రాయొచ్చు.

న్యాయంగా చెప్పాలంటే తిలక్ కాల్పనికోద్యమంలోని సుకుమార భావనా వాసనలు సంతరించుకున్న అభ్యుదయ కవి. ఆయనలో విప్లవంకన్నా వేదన ఎక్కువ. కాని ఆ వేదన ఆత్మాశ్రియమయింది కాదు అది 'ప్రపంచపు బాధ' ఆ బాధని చెప్ప డంలో తిలక్ అభ్యుదయ కవివలె సూటి మార్గాన్ని ఎంచుకోలేదు. 'ధ్వని' మార్గాన్ని ఎంచుకున్నాడు. ఆయన అనుభూతికి ప్రాధాన్యమిస్తాడు. ఆయన 'ఆర్త గీతం' వంటి తొలికాలపు రచన నుండి ఆరంభిస్తే ఇటీవల రాసిన 'అదృష్టాధ్వ గమనం' వరకు పరిశీ లిస్తే ఆయన శైలియేమో భావకవిత్వపు శయ్యలాగా, దృక్పథమేమో అభ్యుదయ కవితా దృక్పథం లాగా కనిపిస్తుంది.

'నా దేశాన్ని గూర్చి పాడలేను; నీ ఆదేశాన్ని మన్నించలేను; ఈ రోజు నాకు విషాదస్మృతి, నా యెడద మోడయిన ఒక దుస్థితి; నేడు నేను కన్నీరుగా కరి గిన గీతికను; మంటలో అంతరాంతర దగ్ధమయిన బూడిదను' ఇట్లా చదువుతుంటే 'ఏడ్వనీండి నన్ను' అని మరొక కృష్ణశాస్త్రి పుట్టుక వచ్చి అంటు

న్నట్లుగానే వుంటుంది. కాని తిలక్ కన్నీరుకు కారణాలు వేరు. అయన 'పైన దైవము నకు కింద మానవునకు జవాబు చెప్పవలసిన' బాధ్యతను తనమీద వేసుకున్నాడు. ఆయన ఏ దృశ్యాలు చూసి అట్లా అయిపోయాడో రాస్తూ 'నేను చూశాను నిజంగా మూర్తీభవత్ దైన్యాన్ని, హైన్యాన్ని, క్షుభితాశ్రు కల్లోల నీరధుల్ని: గచ్ఛత్ శవాకార వికారుల్ని' అంటాడు. ఆయన ఆవేదనంతా అందుకే, 'ఇది ఏ నాగరికతకు ఫలశ్రుతి? ఏ విజ్ఞాన పరికర్షకు పకృతి: ఏ బుద్ధదేవుని జన్మభూమికి గర్వస్మృతి–' అని ప్రశ్నిస్తు న్నాడు. 'ఒక్క నిరుపేద ఉన్నంతవరకు, ఒక్క మలినాశ్రు బిందువొలిగినంత వరకు; ఒక శుష్కస్తన్య సన్నిధిని క్షుదార్తి నేడ్చు పసిపాప ఉన్నంతవరకు....' ఇట్లాగే 'ఒక క్షత దుఃఖిత హృదయ మూరడిల్లనంత వరకు నాకు శాంతి కలుగదింక' అన్నది ఆయన 'అర్తికి కారణం.' ఇంత తేడా వున్నది వస్తు విషయంగా భావకవికీ ఆయనకూ.

ఇట్లా పరిశీలించినపుడు ఏమనిపిస్తుందంటే– తిలక్ భావ కవీ కాదు, నవకవీ కాదు– మానవ కవి– అని. ఆయన అన్ని ధర్మాలను మించిన మానవతా ధర్మంలో నమ్మిక వుంచినవాడు.

'ప్రాణం వున్న నిజమైన మనుష్యులతో నిండిన దేశంలో బ్రతికాడు ఆయన. 'ఆకలి బాధలూ, ఆందోళనలూ, సమస్యలూ విరివిగా వున్న సమాజమిది.' ఆ సమాజానికి ఆయన కోరుకున్నదల్లా 'కడుపునిండా ఆహారం, గుండె నిండుగా ఆశ్లేషం, బ్రతుకు పొడుగునా స్వతంత్రం, కొంచెం పుణ్యం, కించిత్‌పాపం, కాస్త కన్నీరు, మరి కాస్త సంతోషపు తేనీరు.' ఇదే తిలక్ పూర్ణ మానవుని గూర్చి కన్న కల.

'మానవత లేని లోకాన్ని స్తుతింపలేను, మానవునిగా శిరసెత్తుక తిరుగలేను; ఈ నాగరికతారణ్యవాసం భరించలేను. ఈ కృత్రిమ వేషాన్ని అభినయింపలేను.' అవి ఆయనవల్ల కావు. 'మంచి గంధంలా పరిమళించే మానవత్వం మాకున్న ఒకే ఒక్క అలంకారం' అని చాటిన మానవతావాది. 'యుద్ధంమీద యుద్ధం వచ్చినా, మనిషి మీద మనిషి వచ్చినా కన్నుతుదల జాలిలేని' ఈ నాగరికత ఆయనకు మైల పడిన దుప్పటిలా కనిపించింది'. ఈ నాగరికత మనుష్యులను కబళించిందే అన్నది ఆయన బాధ.

తిలక్‌ని అత్యాధికునిగా చూపేది ఆయన కవిత్వంలో ఇంకొక అంశమున్నది. సంప్రదాయ భీరువుల్ని విమర్శించడంలో ఆయనంత తీవ్రంగా ఆధునికులు తక్కువ మంది సాహసించారు. (సాహసించినవారి సాహసంలో మెలకువ లోపించింది. సౌంద ర్యం లోపించింది) అలాంటి ఉదాహరణలు ఇదివరకే కొన్ని ఇచ్చాను. 'ప్రార్థన' అనే కవితలో 'దేవుడా! రక్షించు దేశాన్ని పవిత్రుల నుండి, పతివ్రతల నుండి,

పెద్ద మనుషుల నుండి. నీతుల రెండు నాల్కలు సాచి బుసలు కొట్టే నిర్హేతుక కృపా సర్పాల నుండి, లక్షలాది దేవుళ్ళ నుండి, వారి పూజారుల నుండి, వారివారి నిరంకుశ ప్రతినిధుల నుండి, సిద్ధాంత కేసరుల నుండి, సిద్ధుల నుండి. శ్రీ మన్మద్గురు పరంపర నుండి.' అని దేవుణ్ణే లక్షలాది దేవుళ్ళ నుంచి రక్షించమంటున్నాడు. అట్లాగే కఠినోపనిషత్ అనే గొప్ప కవితలో ఇట్లా రాస్తాడు. "వెలుగుని వెనక్కి నెట్టుతూ రేపటి, రోజుకు పదివేల సంవత్సరాలనాటి పాత ముఖాన్ని అతికేందుకు ఒక హాహాహూహూవు ప్రయత్నిస్తున్నారు" అని.

ఆయన ఇటీవలి రచన యైన 'శిఖరారోహణ' అద్భుతమైన రచన.' పాత మాటల మూటలతో కవులూ వట్టి మాటల సంచులతో రాజకీయ వేత్తలూ మొహమాటం లేకుండా ముందెక్కి కూర్చున్నారు రైళ్ళో' అంటాడు. అట్లా పాత మాటల మూటల కవుల' మీద ఒక విసురు విసరనే విసిరాడు. ఇంకా ఆ కవిత ముగింపులో కొరడా దెబ్బలవంటి తీర్పు ఇచ్చాడు. 'కొత్త దారి తొక్కలేని కొత్త మలుపు తిరుగలేని కుంటీ గుడ్డివాళ్ళ ప్రయాణ కోలాహలం. మురికి కాల్వ మీద. ముసలితనంమీద, మృషా జగతిమీద మహోదయం వికసించదు. వసంతం హసించదు. సంప్రదాయ భీరువుకీ అస్వతంత్ర వితంతువుకీ వసంతం లేదు. సాహసి కానివాడు జీవన సమరానికీ స్వర్గానికీ పనికిరాడు'. అయితే ఆయన శాసించింది సంప్రదాయ భీరువునేకాని, సంప్రదాయాన్ని కాదు, అదే శిఖరారోహణలో ఆయనలో ఎంత సత్సంప్రదాయం జీర్ణించి పరికించిందో కూడా చెప్పుకుంటాడు.

మన సంస్కృతి గురించి కూడ ఆయనకు చాల విశాలమయిన దృక్పథం వున్నది. ఆయన షేక్స్పియర్. డాంటీ, కాళిదాసూ, శంకరుడూ, మార్క్సు,మహాత్ముడూ పికాసో, సా[illegible]' లకు వారసుడిననుకున్నాడు కాని కేవలం కాళిదాసూ, శంకరుడూ, మహాత్ములకే వారసుణ్ణనుకోలేదు. అప్పుడు ఆయన వారసత్వమూ ఘనమయింది కాదు. ఆయన పరిశోధనాపటిమమూ విస్తృతమయిందికాదు. 'మనగలిగినదీ కాలానికి నిలబడగలిగినదీ వద్దన్నా పోదు. మనదైనా మరొకరిదైనా మంచికి జాతీ కులమూ సరిహద్దులు లేవు.' అన్న వసుధైక దృక్పథం ఆయనది. 'యుగయుగానికీ స్వభావం మారుతుంది. అగుపించని ప్రభావానికి లొంగుతుంది. అంతమాత్రాన మనని మనం తీసి పారేసుకున్నట్లు ఊహించకు. సంతత సమన్వయావిష్కృత వినూత్న వేషం ధరించడానికి జంకకుండా సిద్ధంగా వుండడమే అభ్యుదయ లక్షణం.

కాళిదాసు కవిత్వంలోని మాధుర్యం, సౌందర్యం, ఉపనిషదర్థ మహోదధి ఎవడు పోగొట్టుకుంటాడు. ఎటొచ్చీ విధవలకీ వ్యాకరణానికీ మనుశిక్షస్మృతికి గౌరవం

లేదని వీరికి లోపల దిగులు' అని సంప్రదాయ భీరువుల్ని తిరస్కరిస్తాడు. 'వర్తమానా వర్త ఝంఝూవీచికలకి కాళ్ళు తేలిపోతున్నా' యంటాడు వీరికి.

'అయిదు ఖండాల మానవ సంస్కృతి అఖండ వసుధైక రూపాన్ని ధరిస్తోం దని, భావికి సింహద్వారం తెరుస్తోందనీ, ఏ దేశ సంస్కృతి అయినా ఎన్నడూ ఒక స్థిర బిందువు కాదు. నైక నదీనదాలు అదృశ్యంగా సంగమించిన అనంత సింధువు' అని గ్రహించిన అభ్యుదయశీలి తిలక్.

తిలక్‌లో అభ్యుదయ కవుల్లో చాల అరుదయిన మనోజ్ఞ శృంగార భావ మున్నది. అయనఊహ, ఆయన భావన, ఆయన రచన కూడ ఎంత మార్దవంగా వుంటాయంటే అతి పరుషమయిన పదం కూడా ఆయన ప్రయోగంలో ఎంతో హృద్యంగా లలితంగా కనిపిస్తుంది. చిత్రమయిన సమాస రచనలో, కవితా శిల్పంలో అన్యదేశాలయినా అందంగా తెలుగులోకి తెచ్చుకోవడంలో ఆయన ఒక విలక్షణ మయిన మార్గాన్ని చేపట్టాడు. అవి కవిత్వ తత్త్వాన్ని, అంతస్సును చెప్పేవి కాదు గనుక స్పృశించను.

ఆయనలోని విలక్షణమూ వినూత్నమూ అయిన శృంగార భావం గురించి అతిలోకమయిన భావుకత గురించి అదొక అంశంగా వేరే వ్యాసం రాస్తేతప్ప న్యాయం చేయలేం. ఆయనే అన్నట్లు కవిత్వం ఒక Alchemy వంటిదయితే ఫ్రీవర్స్ కవుల్లో ఆ రహస్యం తెలిసిన ఒకరిద్దరిలో ఆయన ఒకడు.

ఈనాటి సమాజం గురించి తిలక్ చాల ఆందోళన చెందాడు. రోజురోజుకూ నిర్వీర్యమయిపోతున్న ఈ ప్రజల్ని ఎట్లా ఉత్తేజపరచడమన్నది ఆయన నిరంతరావేదన. మొన్న మే 27 వ తేదీన ఆయన నాకొక ఉత్తరం రాసాడు. అదే ఆయన ఆఖరు ఉత్తరం. అందులో ఆయన ఈ వేదనయే వ్యక్తమయింది.

'అన్ని ఋతువులలోనూ ఎండిపోయిన ఈ మనుష్యులూ, ఊళ్ళూ మరీ చికాకుని కలిగిస్తున్నాయి. తెలుగు దేశంలో అందం ఆనందం అనేవి దొరకవేమో. ఇంత యిదిగా చచ్చి పురుగుపట్టిన సామాజిక జీవితం ఒక్కొక్కసారి నాలో భయం కరమైన నిరాశని కలిగిస్తోంది.

జి. వి. కృష్ణారావుగారొక వ్యాసంలో నేటి అవ్యవస్థలో మంచి కవులూ మంచి సాహిత్యమూ రావడానికి వీలులేదన్నారు. కాని వారితో నేనంగీకరించలేదు. కవి అవసరమూ కవికి ప్రేరణా యీనాడే- యీ అవ్యవస్థలోనే ఎక్కువవుంది

అన్నాను నేను. కాని దురదృష్టవశాత్తూ Mediocre Talent వస్తోంది మన రాజకీయాలూ సినిమాలూ లాగ. ఏమిటి చెయ్యడం ?

'మనం తిరిగీ కొన్ని విలువల్నీ సౌందర్యాన్నీ సృజించగలమా ! ఇది మనకి సవాల్ !' అని రాసాడాయన. ఆయన నిజంగా చనిపోయేదాకా తిరిగి కొన్ని విలువల్నీ సౌందర్యాన్నీ సృజించడానికే రచనచేసాడు. ఆయనకు రచన ఒక Urge. ఒక తపన. ఒక నిరంతర సత్య సౌందర్యాన్వేషణ.

ఆయన ఏడెనిమిది ఏళ్ళకిత్రం వచ్చిన 'కఠినోపనిషత్' కవితలోనూ, నిన్న మొన్నటిదయిన 'శిఖరారోహణ'లోనూ, మధ్యకాలంలో వచ్చిన చాల కవితల్లోనూ ఈ ఆవేదనయే చోటు చేసుకొన్నది. ఆయన సామాన్యుని జీవితంపట్ల స్పందించాడు. మంచితనం, అనురాగం, మానవత్వం, అందం, ఆనందం, ఇవీ ఆయన ఆశించిన విలువలు. ఆయన కవిత్వంలో అవే సాధించాడు.

'కోరికకీ సంతృప్తికీ, మాటకీ ఆచరణకీ, మనిషికీ మనసుకూ మధ్య అగాధాలు నిలిచి ఆవులిస్తున్నాయనీ, 'అందాన్ని హత్యచేసి వికృతీ ఆనందాన్ని చంపి అశ్రీవూ జీవితపు మైదానంమీద ఒడంబడిక చేసుకున్నాయనీ, ఈ నాగరికత ఎండిపోయిందనీ' ఆవేదన చెందాడాయన. అయితే ఆవేదనపడి దుఃఖంలో కూరుకపోయి నిరాశావాది కాలేదు. ఆ 'ఎండిపోయిన నాగరికత గుండెని పరీక్షించి కొంచెం కొంచెం తన నెత్తుటితో తడిపి' బతికించే ప్రయత్నం చేసాడు. ఆయన ఓటమి ఎరుగనివాడు.

'కోట్లకొలది జనులు ఎండమావుల పండుగలు చేసుకుంటున్నారు.' అని 'కఠినోపనిషత్'లో కఠిన సత్యంచెప్పిన కవి ఆశగా, నమ్మకంతో నిజమయిన మార్పు కోసం ఎదురు చూసాడు ఈ ఎనిమిదేళ్ళు. కాని పరిస్థితిలో ఏమీ మార్పులేదు. '66 ఉగాది సందర్భంగా రాసిన 'శిఖరారోహణ'లో అదే భావాన్ని ఇట్లా చెప్పాడు. 'రెయిలింగ్ అవతల టికెట్లు దొరక్క ప్రజలు దిగాలుపడి నిలుచున్నారు. రేపటి ఉదయానికి వేసిన పట్టాలు ఎవరో తొలగించివేసారు.' ఈనాటి సమాజాన్ని ఒక మధ్యతరగతి సంసారంతో పోలుస్తాడు. 'జడుసుకున్న పిరికివాడు మగడు. జాలిలేని గయ్యాళి అత్తగారు. తన పూర్వపు హోదాని నెమరేస్తూ బతికే మామగారు. ఇంటిచూరు పట్టుకొని వ్రేలాడే ప్రేతాత్మలు గబ్బిలాలు. ఇంటివెనుక పాడుబావిలో మొలచిన పిచ్చిమొక్కలు. ఇదే సమయం అని వీధిలో నిలిచి కన్నుగీటే మొనగాళ్ళు.' ఈ మాటల్లోని సంకేతాలు గ్రహించుకో గలిగితే ఇంతకన్నా ఈ నాటి వ్యవస్థ గురించి ఏం చెప్పగలమని ?

కాని ఇదివరకే చెప్పినట్లు తిలక్ ఈ స్థితిని చూసి నీరసపడిపోలేదు. దిగాలు పడి అస్త్ర సన్యాసం చేసికూర్చోలేదు. ఊరికే తిడుతూనూ కూర్చోలేదు. ఈ సవాల్‌ని స్వీకరించాడు. ఆయన అడుక్కున్న ప్రశ్నకు ఆయనే సమాధానం వెతుక్కునే మార్గంలో పయనించాడు. 'ఇదీ కథ- ఎలారక్తికట్టిస్తావు, రసం పుట్టిస్తావు, ఈ వడగాలిలో హోరులో ఏ రాగం వినిపిస్తావు?' అని ప్రశ్నించుకొన ఆశగా ఒక్కడే అయినా సరే 'దిగులు నీరునిండిన కోటి మనస్సరస్తీరాన ఆయన కవిత కోరికల కోణాకారపు కొత్త చెట్లను నాటుతూ.' సాగిపోయాడు.

'శిఖరారోహణ'లో అంటాడు. 'అపుడు నేను కాలతీరాన ఒక్కణ్ణే నడుస్తు న్నాను- చరిత్రి విచిత్రి సముద్రిలవలోకిస్తూ, అవి విసరిన తుంపరలలో తడుస్తూ. అపుడు నా మీదకి భవిష్యద్గగనం వంగి. నా చెవిలో చెప్పిన రహస్యం విన్నాను, చేతిలో తారల్ని పరీక్షించాను.' అయితే తెలుగు సాహిత్యానికి పట్టిన దురదృష్టం ఏమిటంటే, ఆ భవిష్యద్గగనం చెప్పిన రహస్యం చెప్తున్న వేళలోనే ఆయనను మృత్యువు కబళిం చింది. పైగా ఆయన వాక్కు అమృతత్వాన్ని పొందుతున్న వేళలో.

చివరకొక విషయాన్ని స్పృశించకుండానయినా వదలడం బాగుండదు. తిలక్‌లో అదినుంచీ వున్న 'అభ్యుదయావేదన'కు తోడు ఇటీవల కాలంలో ఆయన ఆధివ్యాధి కారణంగానో, వయ్యక్తిక స్వప్నాల కారణంగానో, నిరంతర పరిశీలన వల్లనో మరి 'అన్వేషణాశీలం' పెరిగింది. ఈ అన్వేషణ బహిరంగంగా చూస్తే ఆత్మా శ్రియమయిందిగా కనిపిస్తుంది కాని, ఆయన అక్షరాల వెంట అట్లా లోతుల్లోకి పోతే అది సృష్టి క్రియాన్నీ, మానవ యత్నాన్నీ అర్థం చేసుకునే ఒక బృహత్తర పరిశోధన అని, ఒక సత్యాన్వేషణ అని అర్థం అవుతుంది.

ఆత్మాశ్రియంగా సాగినట్లు కనిపించే ఆయన 'అదృష్టాధ్వగమనం' అనే గీతం, 'శిఖరారోహణ' ఈ రెండూ ఈ నూతన పరిణామానికి ఉదాహరణలు. 'కఠినో పనిషత్' లోనే సూచించాడు- తానింకా 'మూడవ పరిణామంలోని ఊహలకి ఆకారం కల్పించలేక తికమక పడుతున్నా'నని. కాని ఆ తికమక క్రమంగా తొలగిపోయి వ్యాప్తి లైట్ ఫోకస్ చేసే స్థితి నుంచి అంతరాంతర జ్యోతిస్సీమల్ని బహిర్గతం చేసే పరిణతికి ఎదిగాడు ఆయన. అయితే ఇంకా సమాజంలో స్థూలమైన ఆకృతిని, అస్థిత్వాన్ని పొందని, పొందలేని ఊహమరుత్తుని' అనుకుంటున్నాడు, ఆయన తనను గూర్చి. ఆయనది 'అదృష్టాధ్వగమనం'. ఎవరూ వినని పాటను ఒకే ఒక తీగమాత్రిం మిగిలిన సితారామీద (ఆ ఒక్క తీగ కూడి తెగిననాడు ఆయన అన్వేషణ మౌనంలో ఇంకి

పోతుంది.) పాడుతూ ఎవరూ నడవని బాటలో నడుస్తున్నాడు. 'కొమ్మమీద ఆహారం దొరకని కృకలాసం కంగారు చూపులో, ఊరపతల సందులలో దుమ్ము కొట్టుకపోయిన పిల్లల కళ్ళల్లో ఆరిపోతున్న వెలుగులో, కాలవ వొడ్డున వంకర తిరిగిన తుమ్మచెట్టు కొమ్మల్లోంచి కాలి మసైపోతున్న పశ్చిమ దిశా గగనంలో ఒక భయంకర సృష్టి క్రమాన్ని, మానవ యత్న వైఫల్యాన్ని ఊహించుకుంటున్నాడు. 'మామూలు దారుల్ని మర్యాదల్ని, మంచీ చెడ్డల్ని విడిచి రాత్రిందివాల మధ్య రహఃకిర్మీర రథ్య ఆశతో విశ్వాసంతో, ఆత్మబలంతో సాగిపోయాడాయన. ఆయన లోపల ఆయన బాధలు. 'వెలుపల క్షత జగత్తు ఆక్రోశించిన కరుణాభీభత్స రవాలు. నిరంతర పరిణామ జగత్కటాహంలో సలసల కాగే మానవాశ్రు జలాలు. అయినా అంతర్గత సంగీతం అనుపమ సుందర గీతం ఆయనలో వినపడడం మానలేదు. సృష్టిలోని అర్థం కోసం, జన్మలోని సాఫల్యం కోసం.... ప్రతి తెరనీ తొలగిస్తూ, ప్రతి అఱనీ తెరుస్తూ' నడిచాడాయన. 'ఆకాశమంత నా ఏకాంతంలో అనంత మానవ హృదయస్పందనం వినడం మానలేదు. అలసిన నా ప్రవాసంలో అద్భుత సౌధాల మణి కవాటాలు తెరుచుకోవడం మానలేదు.'

ఇట్లా కవిత్వానికి ఒక తాత్త్విక స్థాయిని తెచ్చిన కవి, 'ఈ నాగరికతఅంతా. ఈ చరిత్ర అంతా. ఈ పరిణామమంతా 'నిరంతర నూతన పరిశోధన, సత్య సౌందర్యాన్వేషణ, ఒక శిఖరారోహణ' అని తేల్చుతున్న కవి, ఎన్నడూ దేనితోనూ అలసిపోడు, విసిగిపోడు. అట్లా సాగిపోతూనే వుంటాడు. ఆ అర్థంలో తిలక్‌కి మరణం లేదు. 'నవనవాలైన ఊహావర్ణార్ణవాల మీద ఉదయించే సూర్య'కాంతిలో ఆయన ప్రభావాన్ని చూస్తూనే వుంటాము.

---

# తిలక్ – మానవ వాదం

కె. వి. రమణారెడ్డి.

"...ఇది నా Final అభిప్రాయంమాత్రం కాదు. తిలక్‌ను బోధపరుచుకోవడంలో ప్రస్తుతానికి ఇది ఒక మజిలీ మాత్రమే."

—రచయిత.

('సృజన'కు ఈ రచన పంపిస్తూ పైవిధంగా వ్రాశారు రచయిత. తాము నూజివీడులో తిలక్ గూర్చి ఇచ్చిన ఉపన్యాస సంక్షిప్త పాఠ ప్రచురణలో ఒకటి రెండంశాలు వేరువిధంగా ప్రకటించిన 'జనశక్తి'కి వ్రాసిన సంపాదకలేఖ ఇది.)

"సృజన"

జీవకారుణ్యవాదం (హ్యూమానిటేరియనిజం), మానవతావాదం (హ్యూమనిజం) ఒకటికావు. 'ఏకోరసః కరుణ ఏవ' అనిన భవభూతి కీ॥ శే॥ తిలక్ కావ్య స్వభావాన్ని నిర్ణయించాడు. కార్కశ్యంకంటె కారుణ్యం ఎంతో మంచిది. అట్లని ప్రపంచమంతా కారుణ్య దృక్పథంతో నడవటంలేదు. అది అటుంచి, మానవతా వాదమనేది యూరపియన్ నూతన భావోద్యమం (రినైజాన్స్) కాలంలో, మధ్యయుగీన మతవిహిత భావజాలానికి జవాబుగానూ, అప్పుడప్పుడే రెక్కలు విప్పుకోసాగిన పెట్టుబడిదారీ ప్రాపంచిక దృక్పథానికి అనువుగానూ, బయల్వెడలిన ఒక తాత్విక సంప్రదాయం. పారలౌకిక చింతనల నుండి మానవ మేధస్సును లౌకిక వ్యాపారాలవైపుకు అది మరలించింది. పోనుపోను, పారిశ్రామిక విప్లవ యుగంనాటికి, దానికి విజ్ఞానశాస్త్రంతోటి పొత్తు కలిసింది. ఈ మానవతావాదంయొక్క పరాకాష్ఠయే మార్క్సిజం. చారిత్రిక దృక్పథం నుండి చూచినప్పుడు, జీవకారుణ్యవాదం మానవతావాదమూ పర్యాయపదాలనిపించవు. మానవతావాద లక్షణాలు రవీంద్రుని కవిత్వంలో కీ॥ శే॥ తిలక్ కవిత్వంలో కనిపిస్తాయి. అవి జీవకారుణ్య వాదపు అతిశయ రూపాలు మాత్రమే. అనుభూతుల నిరంతర విస్తరణ కవికి చాలా అగత్యం. కాని, వర్ణిత వస్తువుతోటి ఎంత ఎక్కువ సహానుభూతి ఏర్పడితే అంత చిత్తశుద్ధిగలిగిన కవిగా అతడు గణనకు రాగలడు. వట్టి లోకానుభవమే అనుభూతిగా మార్పుచెందదు. అనుభవాన్ని మథించి, విశ్లేషించుకొని దానిని మనస్సుకు పట్టించుకొని స్వకీయం చేసుకున్నప్పుడే అది అనుభూతిగా మారు

తుంది. తిలక్‌గారు రాసిన అన్ని కావ్యాలలోగాని, ఎక్కువ కావ్యాలలోగాని ఈ గాఢానుభూతి కనిపిస్తుందనేవారు ఉన్నారు. నా ఉద్దేశ్యంలో తిలక్‌గారి కావ్యాలలో కనుదగిలే కవి అనుభూతికి ముఖ్యలక్షణం విరివీ విప్పూ. ఆయన మనోవైశాల్యం చాలా పెద్దది.

బహుశా ఆయన సాగించక తప్పని ఏకాంత జీవనం కొంతవరకు ఆయన కవిత్వ సంసారానికి, ఆయన అనుభూతికి 'లోతు'ను సమకూర్చలేక పోయిందేమో! అంతకంటే అక్కరకువచ్చే వివరణ లేకపోలేదు. చారిత్రక భౌతికవాదం ఆయనకు అంతగా అమోదయోగ్యం కాకపోయి ఉండవచ్చు. కావలెననే నియమంలేదు కూడాను. చారిత్రిక భౌతికవాది అయినకవే కవిగా గొప్పవాడు. కాని వాడు కాడు, అని నేననను, కాకుంటే తేడా ఉంటుంది, తప్పదు. 'అభ్యుదయ' కవులుగా పేరుబడిన వారందరూ చారిత్రిక భౌతికవాదులనికూడా నేను వాదించను. కాకున్న, వారికి కాస్తోకూస్తో అస్పర్శ ఉంది. పైగా, సమకాలిక ఘటనలను కవి మనస్సు స్వీకరించే సందర్భాన ఆ ఘటనల స్వరూప స్వభావాలు 'అభ్యుదయ' కవికి అవగతమైన తీరున తదన్యునికి కాజాలవు. తిలక్ అటు భావకవీ ఇటు అభ్యుదయ కవీ కాడు అందుకే. ఆ రెండు సంప్రదాయాలలోని కొన్ని లక్షణాలను తనలో సంగమింపజేసుకొని తానొక తీర్థప్రాయుడయ్యాడు. నిజానికి అతని కావ్యాలకు వచ్చిన ప్రాచుర్య ప్రజామోదాలకు కారణం ఇదేనేమో!

"అభ్యుదయ కవి" అని వర్ణించినంత మాత్రాన తిలక్‌కుగానీ మరొకరికిగానీ ఒరిగేదేమీలేదు. నిజానికి "అభ్యుదయ" అనే విశేషణానికి ప్రస్తుతం కవిలోకంలోనూ విమర్శకలోకంలోనూ అంత ప్రతిష్ఠలేదు. తిలక్ ఒకప్పుడు అభ్యుదయ రచయితల సంఘ సభ్యుడైయుండవచ్చు. దీనులను హీనులను గురించి ఏ అభ్యుదయ కవికంటె కూడ తక్కువగా బాధపడి యుండకపోవచ్చు. వారందరికంటె కూడా కమనీయంగా సుబోధకంగా బిగువుగా తేటగా రాసియుండవచ్చు. అయినా తిలక్‌ను ఈ కూటమిలోకి త్రోసివేయడమనేది ఆయన కావ్య స్వభావానికి అపచారమౌతుంది. వసుధైక భావనకూ శ్రామిక అంతర్జాతీయ వాదానికీ అంతరం ఉన్నట్లే, తటస్థతకూ మగ్నతకు తేడా ఉన్నట్లే, కారుణ్య దృక్పథానికీ చారిత్రిక ఆశావాదపూరితమైన సంఘ క్రియాచరణ దృక్పథానికీ భేదమున్నట్లే, తిలక్‌గారి కవితకూ "అభ్యుదయ" కవితకూ తేడా ఉంది. ఇది సభ్యత్వ సమస్య కానేకాదు- స్వభావానికి సంబంధించిన విషయం మాత్రమే.

---

నిడమర్తి
ఉమారాజేశ్వరరావు.

# తిలక్ అముద్రిత వచన రచనలు

నాకు తెలిసినంతవరకు శ్రీ తిలక్ సుమారు పాతిక కథలను, 'సుశీల పెళ్లి' సాలెగూడు, సుప్తశిల అనే మూడు నాటకాలను, సుచిత్ర పరిణయం, ఇరుగు-పొరుగు అనే రెండు నాటికలనూ వ్రాశారు.

తిలక్ వచన రచనలు సరళంగా, సాఫీగా, కవితామయంగా, గొప్ప గొప్పయిమేజరీలతో కూడివుంటాయి. సంభాషణాచాతుర్యం సున్నిత హాస్యం, అత్యం తాధునిక శాస్త్రీయ, అద్యతన రాజకీయ పరిజ్ఞానం, నాటకీయములైన మలుపులు ఆయన రచనల్లో ప్రస్ఫుటంగా కనిపిస్తాయి.

తిలక్ నాటకాల్లో నాయకీ నాయకులు అధికాంశం మధ్య తరగతికి చెందిన వారైయుంటారు. కథల్లో కార్ఖానా కూలీలనుండి సముద్రపు అంచుల్లోనుండే పల్లెకారుల వరకు, దొంగలనుండి దేవుణ్ణి చూసినవాళ్లవరకు, సీతాపతులనుండి సుబ్బారావులవరకు అన్ని తరగతులకు చెందినవారూ వుంటారు.

తిలక్ రచనల్లో సానుభూతి, కరుణ, మానవతావాదం ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. తిలక్ అముద్రిత వచన రచనల్ని ఇక్కడ సమీక్షిస్తాను.

## 1. ఆశాకిరణం:

కుటుంబాన్ని పోషించలేని దౌర్భాగ్యుడు వెంకటాద్రిప్ప. భార్య, కూతురు పస్తులతో మాడుతూ వుంటారు. ఆకలిబాధకు తట్టుకోలేక, పరిస్థితుల ప్రాబల్యంవల్ల కూతురు వ్యభిచరించి డబ్బు సంపాదిస్తుంది, తండ్రి చాటున.

వెంకటాద్రిప్ప గతిగానక రైలు పట్టాలమీద తలపెట్టి ఆత్మహత్య చేసుకోవాలని వెళ్తూవుంటాడు. అతని స్నేహితుడెదురై 'నీ కూతురు డబ్బుకు గడ్డికరచి వ్యభిచరిస్తూవుంటే నీ బ్రతుకెందుకు కాల్చనా? ఏ రైలు క్రిందనో తలపెట్టి చావరాదా?"

అని చీవాట్లుపెట్టి వెళ్తాడు. కూతురు సంపాదన మాట వినేసరికి ఆ దౌర్భాగ్యుని కండ్ల లో ఆశాకిరణం వెలుగుతుంది! తిరిగి వస్తాడు. వేపుడుకూర, నెయ్యి వగైరాలతో భోజనంచేసి తృప్తిగా త్రేనుస్తాడు. ఇంత ప్రియోజకురాలైన కూతుర్ని Congratulate చెయ్యాలనుకుని, రాత్రిపూట కూతురు గదిలోనికి వెళ్తాడు. కూతురు గదిలో వుండదు. దొడ్డి తలుపు తీసివుంటుంది. దొడ్లో కూర్చుని కూతురు కుమిలి కుమిలి ఏడుస్తూ వుంటుంది. అభినందించటానికి ఇది సరియైన సమయం కాదనుకుంటాడు దౌర్భాగ్యుడు వెంకట్రావు. మరోమారు మంచి సమయం చూసుకుని అభినందిద్దామని తిగిరివస్తాడు!

వెంకటాత్రివూ. అతని కండ్లలోనిఆశాకిరణం ఆ ఆశాకిరణానికి కారణభూతురాలైన దీనురాలు, దుఃఖితురాలు అయిన అతని కూతురు మన మనస్సులో మెదులుతూ వుంటారు చాలా కాలం.

## 2. పలితకేశం:

అతనొక రోజున అద్దంలో చూసుకుంటూ వుండగా పలితకేశాలు కనిపించి, తీవ్రిలోచనకు, చాపల్యటుకల విచికిత్సకు గురి అవుతాడు. సుందరి, జవ్వనియైన తన భార్య వినీలకుంతలాల్ని చూసి యీర్ష్యపడతాడు. భార్య అతని దిగులును చూసి. నేను పుని త్రీగా మీ చేతుల్లోనే పోతానని, పోవాలని కోరుకుంటాననీ అంటుంది అతనికి మాత్రిం దిగులు తీరదు.

ఆమె అతని ఆరోగ్యం కోసమై. ఆయువుకోసమై నిరంతర జపతపాలుచేసి తీవ్రి వ్యాధికి గురియై అతని చేతుల్లోనే అసువులు వీడుతుంది. అతను పిడుగులా వుంటాడు. ఆ దుస్సంఘటన చూపి అంతటి హేతువాదీ నీరైపోయి. ఘోరున ఏడ్చి. ఎన్నడూలేనిది భగవద్ధ్యానంలో. భక్తిలో పడిపోతాడు.

ఈ కిథలో రచయిత మనస్సు. అందులోనూ. సైకోన్యూరాసిస్‌తో బాధపడిన రచయిత మనస్సు తీసిన పరుగులు మనకు కనిపిస్తాయి.

## 3. ఊరిచివరి యిల్లు: (ఆంగ్లానువాదం)

ప్రిపంచ కథా సాహిత్యంలో యే ఉత్తమ కథకూ తీసిపోనిదీ కథ. తప్పక అన్ని ఇతర భాషల్లోనికీ తర్జుమా చేయించవలసిన కథ. శ్రీ తిలక్ కాగితాలలో ఈ కథ ఇంగ్లీషు వ్రాత ప్రితి ఉంది.

## 4. సాలెగూడు (నాటకం) :

ఇదొక సాంఘిక నాటకం. తణుకులో నేను చూసిన వ్రాతప్రతి అసంపూర్ణంగాను, తుడుపులతోను వున్నది. పూర్తి ప్రతిని సంపాదించవలసియున్నది.

## 5. సుప్తశిల (నాటకం):

అహల్యా ఇంద్రులు ముందునుండీ ప్రేమీప్రేమికులైనట్లు. గౌతమునితో బలవంతపు పెళ్లి జరిగినట్లు, అహల్య తన ప్రియుడైన ఇంద్రుని గురించి కలలు కంటు న్నట్లు, చివరకు కలుసుకొని తన్మయత్వంలో వుండగా గౌతమునికి పట్టుబడి, ఆయన శాప వశంచేత 'సుప్తశిల'గా మారినట్లూ పురాణ కథలలో మార్పులు చేసి శ్రీ తిలక్ వ్రాసిన నాటకం యిది.



"అపార కృపాతరంగితాలైన నయనాంచలాలు
ఆనందం జాలువారే స్నిగ్ధ దరహాస పరిమళాలు
సంస్కారపు కేశపాశంలో తురిమిన అనురాగపు గులాబి
సదా ప్రజాహితైషిణి, సుభాషిణి, గర్వంలేని రాణి
కల్లనీ, క్రౌర్యాన్నీ కాలుష్యాన్నీ తిరస్కరిస్తుంది
తెల్లని పావురాళ్ళి సరదాగా ఎగరేస్తుంది
చల్లని తల్లి- చక్కని చెల్లి- ఆమె పేరు శాంతి!"

—తిలక్.

## స్మృతి | పరిగి రాధాకృష్ణ

తన్నుచూసి జాలిపడేవాడు
ఒకడైనా వున్నాడని
దేవుడు తెలుసుకున్నాడు
అందుకే నిన్ను పిలిపించుకున్నాడు
తన బరువుగాథ నీతో చెప్పుకునేందుకు
నీ కవిత్వంలో చోటు చేసుకునేందుకు :

అమృతం కురిసిన రాత్రి
నీ వొక్కడివే ఆనందించిగలిగావు
అది నీ అదృష్టం
గొంగళీ పురుగుల్లాంటి మనుషుల్ని చూసి
జాలిపడ్డావు: అది నీ మనసు దినుసు :
హృదయపు కిటికీ తెరిచి
దిగంతాల్లోకి చూడగలిగావు

చేతిలో దీపం లేకున్నా
ధైర్యాన్ని కవచంగా ధరించావు
వసుధైక గీతం ఆలపించావు
అందుకే సూర్యుడు నీ తలమీద పువ్వుగా మారాడు

చిరు చీకటి పలక మీద
రేడియమ్ అక్షరాల్ని రాశావు
అందుకే నీవు నిలుస్తావు
కాలాన్ని గెలుస్తావు
మమ్మల్ని రోజూ కలుస్తావు

---

అసంపూర్ణ మహాకావ్యం

# మంచులు

మల్లవరపు
విశ్వేశ్వరరావు

ా ! తిలక్ !

నీవు కవివి. నీ కవితను స్మరించడమే నిన్ను స్మరించడం. నీ అజ్ఞాతం
ంటిసిజమ్‌లో పేరూదినా, నీ జ్ఞాతం సోషలిజంలో పోషితమైనది. అభ్యుదయులు
కమున్నే నీవు నా స్వప్నలోకంలో అడుగిడి నీ యువ కంఠంతో వచ్చే వాస్తవిక
దయాన్ని గురించి తొలి కోడిలా పాడిన ఆ తొలిరోజులు విస్మృతిలో మునిగి
నేటికీ. ప్రేమను కారుణికం చేశాయి నీ తొలి రచనలు. కారుణ్యాన్ని ప్రేమింప
యి నీ తుది రచనలు. ఎంత బాధాకరమైన సంఘటనలు గానీ నీ లేఖినిలో
చిత్రింగా. వినోదకరంగా, విషాద గభీరంగా, విశ్వజనీనంగా పరిణతిపొంది,
రణ తాత్త్విక చింతనను అతి సాధారణ వాగ్రూపంలో ఇముడ్చుకొని, సాహిత్య
ాన్ని రూపించుకొని, జీవిత సత్యాలను నిరూపిస్తాయి. నీవు వచనంలో
దాస్తావు. ఛందంలో మాధుర్య మొలికిస్తావు.

నీ తుది రచనగా నీవు నాకు వినిపించిన కావ్యం- అసంపూర్ణ మహాకావ్యం-
లు' అనేది విన్నాను. విని ఇది Positive Surrialism లా వుంది సుమా
. ఇది Indigenous సృష్టి సుమా అన్నాను. అంటే, ఏమిటి ? సర్రియలిజం
న్యం, భావశూన్యం, నీరసమది. అది అనర్థానికి దారితీసేతీరు. అది అరాజకపు
చూపుడువేలు. ఆదినుంచీ అదే నా అభిప్రాయం. అయితే నీ రచనలో దాని
కనిపిస్తుంది కాని అది శూన్యంకాదు, రసపుష్టం; అది అనర్థంకాదు, భావ
; అది ఎండిన ఎడారికాదు, ఆర్ద్రమైన అమృతవారి; అది అరాజకతకాదు,
జ్యానికి దారి; అది పాతాళానికి సొరంగంకాదు, శిఖరానికి సోపానమార్గం; అది
న్నించి పెకలించిన పంకిల చిత్రంకాదు, జ్ఞాతంలో పరిణతమై ప్రకాశితమైన
శతపత్ర చిత్రం. ఆ కావ్యం పూర్తిచేశావో, లోకాన్నే చేసుకోమని దిగవిడిచి
వో ? అవునులే, మానవుడే దేవుని అసంపూర్ణ కావ్యం ఈ మర్త్య లోకంలో,
ే అసంపూర్ణ కావ్యమే మానవ కవి మహాకావ్యం తత్‌సాహిత్యంలో.

గతించడమే స్వభావమైన ఈ జగత్తులో కన్నీటికీ గాద్గదికానికీ తావులేద
కావున నిశ్శబ్దంలోనే, నిర్మమత్వంలోనే నీకు నా వీడ్కోలు. ఎవరెస్టు శిఖర
మంచులుదాటి, మా కెవరికీ అందని సత్య లోకంలో, సౌందర్యవనంలో, శాంతి స్రో
స్వినీ తీరంలో నీ వృత్త వేణువులు, వచన వీణియలూ మ్రోయించు. అప్పుడు మంచు
కరగి గాంగనిర్ఝరి ప్రవహిస్తుంది మా లోకంలో. సౌందర్యం పెరిగి వాస్తవ రూప
తాలుస్తుంది మా జగత్తులో. శాంతి లహరి మా బాధిత ప్రపంచ హృదయాన్ని లాలిం
ఓదారుస్తుంది భవిష్యత్తులో.

---

"జలజలమని కురిసింది వాన
జాల్వారింది అమృతంపు సోన
దోసిళ్ళతో తాగి తిరిగివచ్చాను
దుఃఖాన్నీ చావునీ వెళ్లిపొమ్మన్నాను
జీవితాన్ని హసన్మందారమాలగా ధరించాను
జైత్రయాత్రాపథంలో తొలి అడుగుపెట్టాను

అమృతం కురిసిన రాత్రి
అందరూ నిద్రపోతున్నారు
అలసి, నిత్యజీవితంలో సొలసి సుషుప్తిచెందారు
అలవాటునీ అస్వతంత్రతనీ కావలించుకున్నారు
అధైర్యంలో తమలో తాము ముడుచుకుపోయారు
అనంత చైతన్యోత్సవాహ్వానాన్ని వినిపించుకోలేకపోయారు
అందుకే పాపం
యీనాటికీ ఎవరికీ తెలియదు
నేను అమరుడ నని"

—తిలక్.

# జవాబు రాని ప్రశ్న | శ్రీ శ్రీ

అది కాదు, నాకు తెలియకడుగుతున్నాను
ఏమిటీ ఘోరం ?
అబద్ధాలు ప్రకటించడానికి
అలవాటు పడిపోయిన – కాదు
అంకితం అయిపోయిన
ఓ దుర్వార్తా పత్రికలారా ! చెప్పండి
ఈ వార్త నిజమేనా ?
(బహుశా నిజమే అనుకోవాలి. అప్పుడప్పుడో భయంకర సత్యం
ప్రకటిస్తారు ; అప్పుడే మీ అబద్ధాలకు విలువ.)
సిమెంటనే మారుపేరు ధరించిన
ఇసుకతో నిర్మించబడిన
వంతెనలాంటి ప్రభుత్వమా !
ఏమిటీ ఘోరం ?
అని నిన్నడిగి ఏం లాభం ?
నిద్రపో హాయిగా
వృక్షమా ! ఋక్షమా ! ద్విపక్షమా !
బదులు చెప్పండర్రా ! మీరైనా
జవాబులేదు
గాలి మూగదయి పోయింది
పాట బూడిదయి పోయింది
వయస్సు సగం తీరకముందే
అంతరించిన ప్రజాకవి
నభస్సు సగం చేరకముందే
అస్తమించిన ప్రభాకరవి
మరి కనిపించడా ?

కోకిలవలె కూజించే కలధ్వని
కేసరివలె గర్జించే రణధ్వని
ఇక వినిపించదా ?

భావి దూర తీరాలకు
చేరువగా విహరిస్తూ
జీవనాడి స్పందించే
రుధిర మధువులందించే
యువకవి లోక ప్రతినిధి
నవ భావామృత రసధుని
కవితా సతి నొసట నిత్య
రస గంగాధర తిలకం
సమకాలిక సమస్యలకు
స్వచ్ఛ స్ఫాటిక ఫలకం
నడినింగిని మాయమయ్యాడా !?
మనమిత్రుడు
కవితా పుత్రుడు
కదన క్షాత్రుడు
సకల జగన్మిత్రుడు

(విశాలాంధ్ర సౌజన్యంతో)



"ఆగామి ఆశల వర్షాగగనం మీద అదిగో
ఆనందం అనే ఇంద్ర ధనుస్సు
అలమటించే లోకానికి అండగా నిలుస్తుంది
నవకవి వచస్సుధా సుమనస్సు"

—తిలక్.

Printed and Published by Kaloji Narayan Rao on behalf of
'Sahitee Mitrulu,' Hanumakonda;
at the Venkataramana Mudranalayam, Warangal.